కె. వి. సుబ్బారావుగారి

ఆశీస్సులతో

★



— సమర్పణ —

పసలేని నా జీవితానికి ఒసబోసిన

మరపురాని, అమరజీవి

అన్నయ్యకు అంజలితో

★

“ నా లిఖితపూర్వకమయిన అనుమతిలేనిదే యీ నాటకం ప్రదర్శించినా ... కథను రీరైట్ చేసినా నాచే జరుపబడు సివిలు క్రిమినలు చర్యలకు బాధ్యు లగుదురు.”

—గ్రంథకర్త

# ప్రధాన పాత్రలు

| | | |
|---|---|---|
| 1. సూరయ్య | వయస్సు | 50 |
| 2. బసవయ్య | ,, | 48 |
| 3. జానకిరామయ్య | ,, | 45 |
| 4. బ్రహ్మానందం | ,, | 28 |
| 5. గంగులు | ,, | 40 |
| 6. రాజారాం | ,, | 23 |
| 7. చందర్ | ,, | 20 |
| & | | |
| 8. సరోజ | ,, | 15 |

*

కాలం: వర్తమానం.

ప్రోత్సాహకులు :—

1. శ్రీ అన్నంరాజు పాండురంగరావు
2. శ్రీ Y. వెంకటేశ్వరరావు
3. శ్రీమతి P. V. వాణి
4. శ్రీ అలపర్తి సత్యనారాయణ

యీ నాటకం నా పూర్తి స్వంత రచన అయినా అక్కడక్కడా మహామహుల "కొటేషన్లు" దొర్లినవని చెప్పుటకు చాల సంతోషిస్తున్నాను.

## ప్రోగ్రెసివ్ డ్రమెటిక్ అసోసియేషన్, తెనాలివారు ప్రథమ ప్రదర్శనంకోసం ప్రాక్టీసు చేయబడిన

# నటీనటులు

| | | |
|---|---|---|
| 1. సూరయ్య | : | K. భాస్కరరావు |
| 2. జానకిరామయ్య | : | A V. సుబ్బారావు |
| 3. బసవయ్య | : | ధూళిపాళ్ళ |
| 4. బ్రహ్మానందం | : | P. సాంబశివరావు |
| 5. గంగులు | : | ముప్పవరపు |
| 6. రాజారాం | : | V. శేషగిరిరావు |
| 7. చందర్ | : | వెంకటేశ్వర్రావ్ |
| 8. సరోజ | : | లీలాకుమారి |
| మ్యూజిక్ డైరెక్షన్ | : | K. S. ప్రకాశరావు |

ఆర్కెస్ట్రా :-

| | | |
|---|---|---|
| క్లారినెట్ | : | నరసింహాం |
| వయొలిన్ | : | K. S ప్రకాశరావు |
| హార్మోనియం | : | సుబ్బారావు |
| ఢోలక్ | : | సుబ్రమణ్యాం |
| కంజరి | : | పీరుసాహెబ్ |
| పెళ్ళిసీనులో సన్నాయిమేళం వగైరా | : | చిన్నప్ప అండ్ పార్టి. |

మైక్స్ : ప్రభాత్ ఎలెక్ట్రిక్ స్టోర్సు, తెనాలి.
లైటింగ్ : భాస్కర్రావ్
మేకప్ : రామచంద్రరావ్
సీన్సు : ప్రోగ్రెసివ్ డ్రమెటిక్ అసోసియేషన్, తెనాలి.

నిర్మాత : ఆదినారాయణరావ్

డైరెక్షన్ : అలపర్తి సత్యన్నారాయణ

తెరవెనుక ప్రాంప్టింగ్ & వ్యాఖ్య : S. V. సుబ్బారావు

బ్యాక్‌గ్రౌండ్ సాంగ్స్ : 1. ఆంజనేయులు
2. మాదినేని వెంకటేశ్వర్లు
3. జోసెఫ్

★

 మైక్ లు లేనిదే నాటకం ఆడిన రసాభాస అవుతుందని మనవి చేయుచున్నాను.

## హెచ్చరిక

ఈ నాటకాన్ని ప్రదర్శించడానికి నాలుగు కర్టెన్లు కావాలి. అవసరాన్ని బట్టి ఉపయోగ పడేటట్లు అరేంజి చేసుకోవాలి. అలా కాక పోతే నాటకం రాణించకపోగా రసాభాస అవుతుంది.



ఈ నాటకమునకు కావలసిన పరికరములు :—

డ్రాయరు, 4 కుర్చీలు, సోఫాలు, గొడుగుకర్ర, మందు సీసాలు, పుస్తకాలు, దేశనాయకుల ఫొటోలు, కందుకూరి వీరేశలింగం ఫొటో, ఆదిలక్ష్మి ఫొటో, అద్దం, బొట్టుపెట్టె, పోస్టల్ కవర్లు, తంబుర, మంచం, చాప, చెట్లకు నీరుపోసే బొక్కెన, చాకు, శుభలేఖ.

# బ్రతుకు

## SYNOPSIS

## కథా సంగ్రహము

బ్రతుకు ఎవరికి స్వంతం గాదంటాడు బైరాగి బ్రహ్మానందం. బ్రతుకంతా అవరోధాలు, సమస్యలతో కూడుకున్నదంటుంది సరోజ.

శ్రీరాం పురంలో సూరయ్యనే భూస్వామికి ముచ్చటగా మూడో పెళ్ళి చేసుకోవాలని బుద్ధిపుడుతుంది. అదే ఊళ్ళో, జానకిరామయ్య మోతుబరి రైతు. ఆయన ఏకైక పుత్రుడు 'చందర్' B. A. చదువుతూ కాలేజీలో ఇంటర్మీడియట్ చదివే 'సరోజ' అనే యువతిని ప్రేమిస్తాడు. పరీక్ష లయిపోయినయి. ఎవరి ఇళ్ళకు వాళ్ళు వచ్చేశారు.

ఊరు పేరు లేని 'రాజారాం' అనే యువకుడు భూస్వామి సూరయ్య చెంతజేరి రామచంద్రపురంలో బసవయ్య కూతురు సరోజను యిచ్చి సూరయ్యకు పెళ్ళి చేయడానికి ఎత్తుకు ఎత్తు వేసి మనువు ఖాయపరుస్తాడు. సరోజ తండ్రి అమాయకత్వం వల్ల పెళ్ళికుమారుడు ఒక గొప్ప భూస్వామి అని, కట్నం యివ్వనక్కర్లేదని, అల్లుణ్ణి చూడకుండానే పెళ్ళికి ఒప్పుకుంటాడు. శ్రీరాంపురం అనగానే తన చందరే నని భ్రమపడి పెళ్ళికి ఒప్పుకుంటుంది సరోజ. పెళ్ళి జరిగిపోయింది. హృదయాలు చలించినయి.

సరోజ బ్రతుకు ఒక చీకటి యిల్లయి పోయింది. జీవిత సౌఖ్యాన్ని త్యజించి పంజరంలో చిలకలా కర్తవ్యాన్ని విస్మరిస్తూ కాలం గడుపుతూ ఉంది. సంవత్సరం గడిచిపోయింది.

భూస్వామి యింట్లోనే ఉంటూన్న 'రాజా' సరోజను ప్రేమించి ఆమెపై ఒక కన్నువేసి ఉంచుతాడు. సూరయ్యకు అవసానదశ వచ్చింది. సరోజ ఆశలన్ని అడుగంటగా తండ్రికొక ఉత్తరం వ్రాస్తుంది. ఆ మరునాడే సూరయ్య సరోజను ఒక అగాధాన్ని వదలి కన్ను మూస్తాడు. బ్రతుకు భారాన్ని మోయలేక ఆత్మహత్యకు పాల్పడాలని అనుకొన్న సరోజకు ఆనాడు బైరాగి చెప్పిన బోధలు వినబడతాయి. ఉత్తరాన్ని చూసి బసవయ్య తన చిట్టితల్లి బ్రతుకు నాశనమయిందని, ఆమె బ్రతుకును చూడలేనని మందు త్రాగి చనిపోతాడు. యీ విషాద ఆత్మహత్య విషయం బైరాగిద్వారా సరోజకు తెలుస్తుంది. తండ్రిని, భర్తను పోగొట్టుకొన్న సరోజ బ్రతుకు ఏమవుతుంది? రాజారాం ఎవరు? బైరాగి ఎవరు? చందర్ సంగతి ఏమవుతుంది? యివన్ని మీరీ నాటకాన్ని ఆమూలాగ్రంగా చదివితే తెలుసుకుంటారు. మిమ్మల్ని మధ్యలో వదలిపెట్టాననిమాత్రం అనుకోవద్దు.

# 1 వ దృశ్యము



[ స్థలం : ఒక చిన్న తోట. పూలచెట్లు... మనోహరమయిన ప్రకృతి దృశ్యం. కాలం షుమారు సాయంకాలం ఆరు గంటల ప్రాంతం. ప్రవేశం : సరోజ. వయస్సు 18 సం., చూపరులకు పల్లెపడుచులా ఉంటుంది. కాలేజి నాగరికతకు విరుద్ధంగా కన్పిస్తుంది. అందమయిన ముఖవర్చస్సు. సభ్యత, సంస్కారం కలిగిన జుట్టు, కొంచెం ఎగబారిన చెక్కిళ్ళు... ప్రవేశించి అటు యిటు చూస్తుంది. ఎవ్వరూ కనబడకపోవటంతో పాట రూపకంగా పిలుస్తుంది. ]

సూచన :— ఈ దృశ్యంలో స్టేజిని రెండు భాగాలుగా చేయాలి. ముందు భాగంలో ఉన్న కర్టెన్ తొలగిపోతుంది.

సరోజ : (పిలుస్తూ)

ఓ...ఓహో...ఓహోహో...

రావో...

రావో ప్రియా... రావో ప్రియా రా...వో...

[యింతలో వెనుకనుండి ప్రవేశం చందర్. వయస్సు 20 సం. సన్నగా పొడుగ్గా ఉంటాడు. ఫుల్ సూట్... యీవెనింగ్ హ్యాట్... కోల మొహం. నవ్వుతున్నట్లుగా ఉండే వెడల్పు నోరు. ఆకర్షణీయంగా ఉంటాడు. సంస్కారం, సభ్యత ఉట్టిపడే సహజమయిన నాగరికత. చెట్టుచాటుగా ప్రవేశించి పై పాటను అందుకుంటూ ]

చందర్ : ఆ...హా !

సరోజ : రావో ప్రియా...రావో ప్రియా రా...వో...

చం : రానే చెలి... రానే చెలీ...రా...నే...

స : హృదయమనే గదినుండి పయనమేలరా...

పయనమేలరా...

చం: ఎదలలోన వదలలేని ప్రేమయున్నదా...
ప్రేమాయున్నదా...

స: వలపులవే పిలుపులై పిలుచుచున్నవి...
పిలుచుచున్నవి...
తలపులవే అలలుగా పొరలుచున్నవి...
పొరలుచున్నవి...

చం: చూడుమదే కోకిలమ్మ కూతలేమిటో...
కూతలేమిటో...
కూతలోన దాగియున్న భావమేమిటో...
భావమేమిటో...

స: చేతనయినంతవరకు చేయుమన్నది. చేయుమన్నది...
ఊతకావాలంటే నన్ను అడగమన్నది...అడగమన్నది..

చం: ఎవరు...? ఆ కోయిలా...

స: కాదు... నువ్వే...

యిద్దరు: రావో ప్రియా...రావో...ప్రియా...రా...వో...

సరోజ: (పాట నాపి) ఏం! రానంటివిగా...? ఎందుకొచ్చావ్ ?

చందర్: ఎందుకాఁ! నీలో అణగిమణగియున్న అందాన్ని దొంగిలిద్దామని...

స: ఓ...యీ దొంగతనం...ఎప్పుడు నేర్చావ్...

చం: నీవు నేర్పిన విద్యేగా... నీరజాక్షి...

స: ఏం! కవిత్వంలోకి దిగుతుంది ప్రేమ...

చం: అసలు ప్రేమ కవిత్వంలోనుండే పుట్టిందిలే...(సమీపిస్తూ) నిజానికి చెప్పాలంటే సరోజా...ప్రేమలేందే కవిత్వంలేదు.

కవిత్వంలేందే ప్రపంచం లేదు... ప్రపంచంలేందే మనిద్దరం లేం... ఏమంటావ్...

స : ఏం ! శృంగారం శృతిమించి పోతుంది లాగుంది...

చం : అహాం ! హాస్యరసాన్ని అతిగా పోషిస్తున్నాంలే...

స : సరేగాని... ప్రయాణం ఎప్పుడు ?

చం : ప్రయాణమా... ప్రణయం ముగిసిన తరువాత...

స : ప్రణయం ముగిసిన తరువాత మిగిలిన ఋణం...

చం : యిదుగో నా ప్రమాణం...(అని తన ఫోటోను యిస్తాడు)

స : (చేతిలోకి తీసుకొని) చందర్...ఎవరీ బొమ్మ...

చం : (వెక్కిరిస్తూ) బొమ్మగాదు...ఓ సరోజమ్మా యిది... ఒక దిమ్మ...హుం ! మొత్తానికి పల్లెటూ రసిపించావు...

స : (ఎగతాళిగా) ఓహోహో ! మీది పల్లెటూరుగాదు... చాల పెద్ద బస్తీ... మీ బస్తీ జనాభా అయిదు వందలు. అందులో చదువుకున్న వాళ్ళు అయిదుగురు...

చం : సరోజా !

స : చందర్ ! (యిద్దరు నవ్వుతారు)

చం : సరోజా ! ఏమిటీ వేషం...

స : ఏం ! నే నెలా ఉన్నాను.

చం : ఎలా ఉన్నావా ? పట్టి అన్ సివిలైజ్డ్...అనాగరికత...

స : చందర్...నాగరికత వేషాల్లోనే ఉంటుందా... B. A. వరకు చదివి ఎంత పొరబడ్డావు... వేషాల్లో నాగరికత ఉన్నంతమాత్రాన భాషణలో లేకుండ ఉంటే ఆ నాగరికత అనాగరికతేగాని... నాగరికత అని అనిపించు కొం టుందా... ? ఎంతో దూరాన్నుంచి యిల్లు వాకిలి వదలి

బస్తీకి చదువుకని వచ్చినప్పుడు నాగరికత చదువులో చూపించాలి...సంస్కారం సభ్యత నేర్చుకోవాలిగాని...

చం : (మాట నందుకుంటూ) సరోజా ! కట్టిపెట్టు...సరోజా! నీ ఉద్దేశ్యాలు... నీ భావాలు... నాకు తెలివ్వూ... అవి ఉన్నతాలని నే నెప్పుడో అనుకున్నా. అవే నిన్నే నాటి కయినా ఒకదారికి తీసుకొచ్చి ఉన్నతస్థాయిలో నీవు మసల టానికి అవకాశం... ఆస్కారం కల్పిస్తయి...

స : చందర్...

చం : సరోజా ! చూడు. అదిగో... ఆ కోయిల జంట లేమి చేయుచున్నవో చూడు...

స : ఊహూ ! నాకేమీ తెలియటం లేదు...

చం : అదో చూడు... అవేమి మాట్లాడుకుంటున్న వో !

స : ఏమో...అది అర్థంగాని భాష.

చం : సరోజా ! యిటురా ! (దగ్గరకు వచ్చి) చూడు... ప్రేమానుబంధం ఎంత... తీయనిది. చిలవల పలవలుగా పెరిగి జీవితాన్ని సమ్మోహన పరుస్తుంది.

స : అవును...ప్రేమానుబంధం ఎంత తీయనిది... చందర్... నిజంగా జీవితంలో యిది ఒక మధురమయిన కలయిక...

చం : మధురమయిన దేకాదు... మరపురాని మనోహర ప్రేమ బంధం... సరోజా... ఊరు వెళ్ళి ఉత్తరం వ్రాస్తావుగదూ !

స : తప్పకుండా... చిరస్మరణీయమయిన... యీ కలయికను అడుగడుగునా మరువకూడదని... ఆనందంతో ఉచ్చరిస్తూ కాలంగడుపుతాను...

చం : సరోజా... ఏదో... బస్తీకి వచ్చాం. చదువుకున్నాం. ఒక క్లాసు కాకపోయినా స్నేహం కలసింది. అది ప్రేమ లతలా పెంపొందింది... ఆ లత జీవితానుభూతులతో పెరిగి పెద్దదైపోతుంది... ఆ లతకెప్పుడూ... నీరు పోస్తూ ఉండు సుమా...

స : ఋతువులు సరిగాఉండి... ప్రకృతి అమృతోదకాలను కురిపిస్తే...అదిమాత్రం ఎంత... పెరిగి పెద్దదై జిగిబిగిగా అల్లుకొనిపోదూ... ?

చం : సరేగాని... మీ ఊరు ఏదన్నావ్... ?

స : యింతలోనే మర్చిపోయారా ? యిలాగయితే మొన్న పరీక్ష లెలా వ్రాశారు ?

చం : పిచ్చిదానా... నేను నిజంగా మర్చిపోయాననే !

స : మర్చిపోకుండానే... ఎందుకు మళ్ళీ అడిగారు.

చం : మళ్ళీ ఆమాట లా మధుర మయిన పెదిమలగుండ వినా లనే కుతూహలంతో...

స : అబ్బ... ఎప్పుడూ కొంటెమాటలే... సరే... యిక వెళ్దాం... పద...

చం : అప్పుడే... యింత తొందరగా...

స : బండి టయిం అయిపోతుంది...

చం : యిట్సు నా సిస్ను వోల్లీ... యింకా టు అవర్స్ టైం ఉంది... అబ్బబ్బ... పాతపద్ధతులు... పురాతనాచారాలు... బండి టైం రెండుగంట లుందనగానే బయలుదేరటం...

స : ముందే వెళ్ళి కూర్చుంటే ప్లాట్‌ఫారం వద్దనదులే. అయినా మనం బండికోసం ఉండాలా ? బండీ మనకోసం ఉంటుందా

చం : డామిట్... కథ అడ్డం తిరిగింది... యిప్పుడే ఒక ఫ్రెండ్ వచ్చి కలుసుకుంటా నన్నాడు...

స : ఆఁ! ఎప్పుడూ ఫ్రెండ్సే... అదో...జట్కా వచ్చినట్లుంది. సామానది సర్దుకొని బయలుదేరు... (జట్కా చప్పుడు)

చం : యీ జట్కా కూడా యిప్పుడే రావాలీ... సరే బయలు దేరు... తప్పుతుందా...

స : తప్పదులే...యింటికెళ్ళటం తప్పుతుం దనుకున్నావేమో... నువ్వింక యిక్కడుంటే చెడిపోతావు శీఘ్రంగా...నేరుగా యింటికి నడువు ..

చం : చిత్తం... (యిద్దరు వెళతారు)

[రెండో కర్టెన్ తొలగిపోతుంది]

[స్థలం...సూరయ్యగారిల్లు. రెండు కుర్చీలు, ఒక డ్రాయరు, ఒక పడక కుర్చీ ఉంటయి. డ్రాయరు ప్రక్కగా ఒక మంచం ఉంటుంది. డ్రాయరుపైన మందుసీసాలుంటయి సూరయ్య కుర్చీలో కూర్చొని మందు సీసాలో ఉన్న మందు కొంచెం పుచ్చుకొని ఒక్క నిట్టూర్పు విడిచి]

సూరయ్య : (తనలో) హుఁ! జీవితం అంటే యిపుడు తెలుస్తుంది... నిజంగా కాలవైపరీత్యాన్ని కనిపెట్టడం... మానవ మాత్రుల శక్యంగాదు...నిన్నటికి యివ్వాళకు ఎంతమార్పు? అవును... ఆడది లేని యిల్లు ఎంత చింతాక్రాంతంగా ఉంటుంది... యింతకూ దానికి రోజుల్లేక దాని జీవితం వెళ్ళమార్చుకు పోయింది... అంతేలే... "జాతస్య మరణం ధ్రువం" అన్నారు... (ఆలోచించు కొన్నట్లు) అయినా...

నేనయినా రేపు అంతేగా… ఉహుఁ కాదు. నేనేమిటి అందరూ అంతేలే…

(యింతలో రాజారాం ప్రవేశం)

రాజారాం: (మాటనందుకుంటూ) అందరికీ మీకు సాపత్య మేమిటి?… మీారు మీారే…

సూ: (కుర్చీను చూపుతూ) కూర్చో… కూర్చో… యిదే… రావడమనుకుంటాను… పోయినపని కాయా… పండా?

రా: హుఁ. రాజా వెళ్ళడం… పండుగాక కాయ అవ్వడం ఎంత మాట… సరే… మీా పనెలాగుంది…?

సూ: (నిట్టూరుస్తూ) హుఁ! డాక్టరు వచ్చాడు. నా వ్యాధి దీర్ఘవ్యాధి అని… దీనికి మందు దీర్ఘంగానే పుచ్చుకోవా లని… (ఆపుతాడు)

రా: (జాలి తెచ్చుకుంటూ) అలాగా…

సూ: అంతేకదురబ్బాయి… కదిలితేబండి… కదలకపోతే మొండి. ఏముంది… మన జీవితాలన్నీ యింతేరాబాబు… ఎముకల గూళ్ళు… అతుకుల బ్రతుకులు… ఆఁ! అసలు శుభవార్త సంగతి చెప్పకపోతివి…

రా: (చిటికవేస్తూ) యింకెన్నాళ్ళు? ఆరు రోజులు మాత్రం. ఓన్లీ సిక్సుడేస్…

సూ: (ఆశ్చర్యంగా) ఆఁ! నిజంగానా… ఆరు రోజులా… రాజా… మొన్న చూచివెళ్ళినవాళ్ళు, ఏమని నిశ్చయించు కొని దారికొచ్చారా అని…

రా : (తాపీగా) సరి... రాజా... ఎప్పుడూ ఏపనీ "కాదన్నా" అని జన్మలో అనలేదు. అనడు. అనబోడు. రాజా అంటే టెరిబుల్, అంటే అమోఘం...

సూ : అసలు దారి కెలా వచ్చారా అని...

రా : ఎలాగా... లంచం... అబద్ధాలు... ఎరవేస్తే అరనిముషం పట్టదు. అరమర లేకుండా పడిపోవాల్సిందే.

సూ. (ఆశ్చర్యంగా) లంచమా... అబద్ధాలుగూడా పైగా. రాజా...

రా : (మాటనందుకుంటూ) లంచంలో ఏముంది గోంగూర... లంచం లేందే యీ రోజుల్లో కంచంలోకి యింత కూడు గూడ రాదు... అబద్ధాల్లో ఏముంది వంకాయలు... అబద్ధాలాడందే ప్రబుద్ధు డెలా అయ్యాడో చెప్పు... సూరయ్యగారూ... ఎందుకు ప్రపంచాన్ని కలా జడుస్తారు. ఎన్నాళ్ళిలా ఉండి యీ భావచింతనలో మునిగి అణగి ఉంటారు. గిల్టీకాన్షస్ లేకుండా ఉండండి. ఉల్లాసీదా చేసి రాజును బూజుగా, బూజును రాజుగా చేసి మోజుగా కాలం గడిపిస్తా... రాజా... అంటే టెరిబుల్... బ్రెయినుంది... సూరయ్యగారూ... జీవంలేని కర్రగాదు... భావం ఉన్న బుర్ర ఉంది... అంతే...

సూ : (సంతోషం తెచ్చుకుంటూ) మనువు సంగతి చెప్పక పోతివి...

రా : రామచంద్రపురం మనువులో ఏమాత్రం లోపంలేదు. వయస్సు 14 సంవత్సరాలు. మనువు విషయంమాత్రంమనం మరువలేం. పెళ్ళివిషయం కళ్ళెం పట్టుకునేదాక తెచ్చాం.

సూ : మరి కట్నం అడిగావా ?

రా : అడగటమే ? అడగడమేమిటి ? భావాలు ఉన్న తాలు... జీవికి కట్నం ఆశలేదు... ఆశాపాశం లేకుండ సమ్మోహ నాస్త్రంలో పడవేశాం .. అంతే... గిరగిర తిరిగి... దాసోహం అనాలి... అంతే.

సూ : పెళ్ళికొడుకు వయస్సెంతని అడిగితే...

రా : అవన్నీ ముందే ట్రయిల్ చూసుకున్నాంగా...

సూ : అయితే పెళ్ళికూతురు పేరు.

రా : సరోజినీదేవి... ఆమెనే సరోజా అంటారు... చదువు సంస్కారం... అందం... చందం... అన్నీ అట్టే పుట్టుక తోనే ఉన్నయ్యంటే నమ్మండి. ఉన్నతమయిన ఆద ర్శాలు... ఎవరెస్టును బోలిన తేజస్సు... మంచుకొండ లాంటి మృదువయిన శరీరం...

సూ : రాజా... ఒక్క క్షణం ఆగటానికి వీల్లేదు. మరి ముహూర్తం...

రా : వచ్చే దశమీ బుధవారం.

సూ : సరే! యిక నాకుమాత్రం ఎవరున్నారు. రాజా... యీ నాలుగు రోజులు నిలబడి నీ వా బియ్యపు గింజలు నెత్తిన వేయించు.

రా : రాజాకు... ఆపని మాత్రం ఎంత... ?

సూ : రాజా... నిజంగా నీ ఋణం ఎలా తీర్చుకోనేది ? మీ తల్లిదండ్రులను గూడ నా పెళ్ళి కాహ్వానించు. ఇంకా నీకున్న స్నేహితులు... !

రా : (విచారంగా) తల్లి...దండ్రి... యింకెక్కడ... వాళ్ళెప్పుడో పోయారు. మా అన్నయ్య దేశాలమీద బైరాగై తిరుగుతున్నాడు. నేను మా ఆస్తిని తెగనమ్ముకొని యీ విధంగా... (ఆపుతాడు.)

సూ : పాపం... అలాగా... నీ విక్కడే ఉండిపో. నా తమ్ముడు మాదిరిగా చూసుకుంటాను.

రా : దానికేం.

సూ : సరే... ఆలస్యం అమృతం విషం అన్నారు. పనులు త్వరగా కానివ్వాలి. పనివాళ్ళను పిలిచి పనులన్నీ సిద్ధం చేయించు.

రా : ఓ... అలాగే... (వెళతాడు)

సూ : (వెళ్ళిన తరువాత) అఖండుడు లాగున్నాడు... అయినా తెలి వేవడి సొమ్మూలే...

[క్షణంసేపు నిశ్శబ్దము... ఆలోచనలో మునిగిపోతాడు సూరయ్య. తోచదు. లేచి అటూ యిటూ తిరుగుతాడు.]

[ఇంతలో ప్రవేశం జానకిరామయ్య. వయస్సు 50. తెల్లటి లాల్చి. ఖద్దరుపంచె కట్టుకుంటాడు. జరీఅంచు ఉత్తరీయం. గొడుగుకర్ర. బుర్ర మీసాలు. మనిషి చూపులకు డాబుసరిగా ఉంటాడు.]

జానకి : (ప్రవేశిస్తూ) ఏమిటండి బావగారూ ... ఆలోచనలో తర్జన భర్జన లవుతున్నారు.

సూ : (వెనక్కు తిరిగిచూస్తూ) ఓహో! బావగారు. బహుకాల దర్శనం...సమయాని కొచ్చారు...ఆఁ! అబ్బాయి...బాగా పెరిగి పెద్దవాడై చదువూ సంధ్యా ... అన్నీ దారిలోకి వచ్చాడుగదూ...?

జా : ఆఁ! ఆఁ! మొన్ననే వచ్చాడు. B. A. పూర్తయింది. చాలమంచివాడు లేండి ...

సూ : అరెరె. కూర్చోకుండా అలా నిలబడే ఉన్నారేం. ఆఁ! ఆఁ! కులాసా ? దాహం...పుచ్చుకుంటారా.

జా : అమ్మమ్మ...అక్కర్లేదు. అంతపని మీచేత చేయించను...

సూ : పరవాలేదు ... అబ్బాయి B. A. పూర్తి చేశాడన్న మాట .. శుభం ... మరి వివాహం చెయ్యలేక పోయారూ ?...

జా : అదే చూస్తున్నాను ... చాలమంచివాడు లెండి మావాడు...

సూ : అవును ... ఆవును బట్టే దూడ ... తండ్రికి దగినబిడ్డ యింటికితగ్గ పందిరి అన్నారు ... అక్షరాల నిజం ..

జా : చిన్నపని ఉండి వచ్చాను...

సూ : చిన్నపనులయినా రావడం తప్పదూ! పెద్దపనులయినా రావడం తప్పదు గదండి ... బావగారు ... ఏంటండి...

జా : అక్షరాలనిజం... ఆఁ! మీ యింటి కీమధ్య రాజారాం అనే యువకుడు వచ్చాడు... అతను ఉన్నాడేమోనని...

సూ : ఏఁ! ఏమన్నా పెళ్ళిసంబంధమూ ?

జా : అబ్బెబ్బె... కాదు... కాదు...

సూ : యిప్పుడే బజారు కెళ్ళాడు... మీ రిటు వచ్చారు... అత నటు వెళ్ళాడు.

జా : అయితే మా పాలేరు గంగులు యింతకు క్రితం రాలేదన్న మాట...

సూ: ఆఁ! ఏం గంగులు... గొంగళిలాగ... ఎక్కడవేస్తే అక్కడే ... అయినా ... యీ రోజుల్లో అలాగా అలగా వాళ్ళను చేరదీస్తే లాభంమాత్రం ఏమీ ఉండటంలేదంటే అతిశయోక్తి గాదంటే నమ్మండి...అంటే అన్నారంటారు... వాళ్ళకన్నీ రూల్సే... అబ్బెబ్బె...వాళ్ళను చేరదీస్తే మోర మీద కొడతారు...

జా: నిజం... నిజం...

సూ: ఆఁ, ఒక శుభవార్త... (ఆలోచించి)...నా వివాహం... తృతీయ వివాహం ... యింకా ఆరురోజులు...

జా: మంచిదే ... యింటికి ఆడది అనే దిక్కుఉండాలనే నే ననేది... సరే వస్తా... (వెళతాడు)

సూ: (వెళ్ళిన తరువాత) యింటికి ఆడది ఎంతో అందం.

[ యింతలో తెరలో పాట వినిపిస్తుంది. పాడుకుంటూ ప్రవేశం గంగులు. వయస్సు. 40 పైబడి ఉంటయి. ముఖంలో అమాయకత్వం నిండి ... నాగరికతలో ... సంస్కారంలో చాలవెనుక ఉన్నట్లు కనిపిస్తాడు. బుర్రమీసాలు. చిరిగిన చొక్కా. పాతచెప్పులజత. యివి వాని వేషభూషణాలు ... ]

గంగులు: (పాట) ఓ...

ఎండమూరి కొండపైన అండలేక దొండ తీగెన
పండు ఒకటి ఉన్నదిరా... చల్ మోహనరంగ
నీకీడు జోడూ కాదు గదురా... ఓ...
లోక మెంత మారిపోయెనురా... చల్...

(ప్రవేశించి) ఓ... దొరా... వచ్చానండోయి... కొత్తంత పనుండి... వచ్చానండోయి...

సూ : ఊం! తగుదునంటూ రాగాలు తీసుకొంటూవచ్చావ్ఫూ...
ఇప్పుడే మీ దొర యిక్కడకు వచ్చి నిన్నడిగాడు...
గం : మా దొర నాకోసం కాదులే. వున్నవారి కోసమే వచ్చాడు. సరేకాని మీ యింట్లో... మీ యింట్లో...
సూ : సంతోషించాంకాని వచ్చినదారిన దయచెయ్యి...
గం : దాని సిగ తరగ... ఉన్నవాళ్ళను ఉండనంటే ఉండమంటారు. లేనోళ్ళను ఉంటానంటే వెళ్ళమంటారు. ఏంటొండ యీ పెపంచకం. అంతేలే. పల్లపు నీళ్ళు పల్లానికే. మెరకనీళ్ళు పల్లానికే.
సూ : గంగులూ నీవు వచ్చింది మా రాజారాంకోసమే కదూ.
గం : అవునండ... రాజారాంగోరు ఎటు ఎల్లారు ?
సూ : బజారువెళ్ళాడు...అతనికోసమేవస్తే నీవు వెళ్ళవచ్చు.
గం : వెళ్తానుగా నొండ ... నాకు తెలవకడుగుతాను. మన పెళ్ళంట నిజమేనండ ... యీ బజారు మూలలలో అనుకుంటున్నారు.
సూ : (సంతోషిస్తూ) ఆఁ! ఆఁ! నిజమేరా ... యింకా ఆరు రోజులున్నది.
గం : హిహి...మా అయ్యగారికి ముచ్చటగా మూడోపెళ్ళి... హిహి ... యింకా ఆరు రోజులకు నాకు మస్తుగా పప్పన్నం...
సూ : ఒరేయి గంగులూ నేనెల ఉన్నా(నా...?
గం : హిహి...రాజా...రాజాలాగ ఉండారు...
సూ : ఏదీ...మరొక్కసారి ఆమాట...

గం : హిహిహీ... రాజా... రాజా... పెళ్ళికొడుకు అరవై ఏళ్ళ
పడుచు పిల్లాడు...

సూ : (కోపం తెచ్చుకుంటూ) ఆరివెధవా ... ఏమన్నావ్...
తిండి ఎక్కువై పుంసుపట్టి ఏమంటున్నావ్...

గం : ఆఁ! మీరుపెట్టేతిండి ఎక్కువై...పులుసేంది ... అలుసు
కూడ అవుద్ది ... సూరయ్యగారూ ... ఆమాట మీర
నక్కర్లేదు ... నేను యినక్కర్లేదు ... మీకుంటే నాలుగు
సార్లు తింటారు ... అయిదు సార్లు పారేత్తారు. మాకేం
ఊరికా పెట్టి పోసిత్తన్నారేంటి.. ?

సూ : ఉపన్యాసాలు దంచేస్తున్నావుగాని... వచ్చిన దారినే
దయచెయ్యి...

గం : సూరయ్యగారూ... నాకోమాట అడగాలని ఎంతో
ముచ్చటగా ఉంది... అడగమంటారా!

సూ : ముచ్చటగా ఉన్నమాట అడగకుండా వెళ్ళడం
ఎందుకు... అడిగేపో.

గం : పో... పో... అంటారు... పోతాంలెండ... మీకుండ
మన్నా ఉండనులేండ... ఆఁ! మీరన్నట్లు పెపంచకం
మారిపోయిందా... మడుసులు మారిపోయారా... నా
మనసు యిందాకటనుంచి జవాబడుగుద్ది. సమాదానం...
మడుసులే నంటాను... ఒప్పుకున్నారా?

సూ : కాలమూ మారింది... మనుషులూ మారిపోయారు...
రెండింటిలో ఉంది... తేడా ...

గం : కాలాని కేమండి ... ఎప్పుడూ పొద్దు తూర్పునే
పొడుత్తుంది అప్పుడి మాదిరిగా ...

సూ: అయితే మనుషులే మారా రంటావు...

గం: అంతేనొండ...కాకపోతే నాయాల్ది మీసాలు నెరిసినాక
పెల్లి యీ వరకు యిన్నామా ... కన్నామా ...?

సూ: ఛీ! వెధవా? క్షణం ఉండటానికి వీల్లేదు. ఫో...
బయటికి నడిచి మాట్లాడు...ఎప్పుడూ ఏది మాట్లాడినా...
నన్నే దెబ్బగొట్టడానికి చూస్తూ ఉంటావు...

గం: అయ్యో బాబ ... అంత కంగా రెందుకు ... అయితే
నాకూ్కడ ఒక సంబంధం చూద్దురూ...

సూ: ఛీ! వెధవా! నీకు పెళ్ళేమిటి?

గం: మరి ... మీకో...

సూ: సిగ్గుండాలి వెధవలకి...ఒకసారి గడ్డి పెడితే చాలదూ...

గం: అయితే ఎల్తన్నా... సూరయ్యగోరూ... ఓ సూరయ్య
గారో... ఎల్తన్నా ... మరి మీకో ... హి హి హి...
మరి మీకో ... (వెళతాడు)

సూ: వెధవలు.. అందరికీ ఎగతాళే...మూడుసార్లుగాదు...
ముప్పయిసార్లు చేసుకొంటాను. యీ వెధవ లందరికీ
ఎందుకు? మొత్తం ఆడవాళ్ళ నందర్ని నా ఆస్తితో
కొనేస్తాను.

గం: (తిరిగి ప్రవేశించి) కొనెయ్యవయ్యా ... కొనెయ్య...
కొంటావుబాబూ ... కొంటావు ... ఆ డబ్బే లేకపోతే
నీమీద యీగలుకూడ వాలేయి గాదు.

సూ: (కోపంగా లేస్తూ) పో... బయటికి... ముందు నడచి
మాట్లాడు... మారుమాట్లాడితే నిన్ను కట్టివేయిస్తా...
వెధవపీనుగా... వెధవపీనుగా. (అంటూండగా తెర)

# 2వ దృశ్యము

[ స్థలం బసవయ్యగారిల్లు. ఒక చిన్న పంచ. పంచ గోడకు దేవుడు పటాలు, దేశనాయకుల ఫొటోలుంటయి. ఒక ప్రక్కగా చందర్ ఫొటో వ్రేలాడు తుంటుంది. సరోజ తల దువ్వుకొని బొట్టుపెట్టుకొని అద్దంలో ముఖం చూస్తూ ]

చూపులకు చల్లనిది రుక్మిణీదేవి
మాటలకు మంచిదే మరి సత్యభామ
రుక్మిణీ సత్యలూ అక్కచెల్లెళ్ళూ
తొల్లొక్క జన్మాన తోడికోడళ్ళు
తోడికోడలు పెద్ద దొరసాని పెద్ద
అందరికంటె పెద్ద అలివేలి మంగ ...

(ఒక జానపదగేయం ననుసరించి)

సరోజ: (అద్దం తీసి వంకెకు తగిలించి చందర్ ఫొటోవంక చూస్తూ) చందర్...అబ్బ...(ఫొటోను చేతిలోకి తీసుకొని) యీడొచ్చి ఎంత బాగున్నాడు....కొంటె మాటలు... ఎప్పుడూ అంతే... అన్ని విషయాలు తెలిసికూడ నాచేత చెప్పించుకుంటానికి పన్నాగాలు పన్నుతాడు. (యింతలో పిలుపు. బసవయ్య ప్రవేశం. ఫొటోను దాచివేస్తూ) నాన్నా... నాన్నా...మరే...మరే ...

బస: ఆఁ! ఏమిటో చెప్పు ...

స: (నవ్వుతూ) నాన్నా...

బ: చెప్పు. చెప్పి అయినా నవ్వు... నవ్వి అయినా చెప్పు... ఏమిటమ్మా సరోజా... ?

స : మరే ... రాత్రి నాకు ఎలాంటి కల వచ్చిందనుకున్నా... భలేకల...

బ : కలలు కంటున్నావా తల్లి ... అవును యీడొచ్చిన పిల్లవు...అమ్మా సరోజా ... ఒక శుభవార్త చెప్పనా...

స : చెప్పు...చెప్పు నాన్నా...

బ : యీ చేతిలో ఏముందో చెప్పు... (అని చేయి మూస్తాడు)

స : ఆ చేతిలోనా ...ఏదో ...వస్తువుంది ..

బ : అదేదో చెప్తే ...

స : చెప్తే ఏమి బహుమతి...?

బ : బహుమతా...నీకు వెంటనే పెళ్ళిచేస్తా ... సరేనా ... (నవ్వుతాడు)

స : (నవ్వుతుంది) నాన్నా...అదేమిటో చెప్పవా?

బ : చెబుతా నన్నావుగా చెప్పు...

స : చెబుతానులే...ముందు నీవు చూపించు ...

బ : పిచ్చిపిల్లా...ఎంత అమాయకపు దానివమ్మా ... నిన్నెవరు పెళ్ళి చేసుకుంటారోగాని...అబ్బబ్బ...

స : ఎవరూ చేసుకోకుండా ఉండరులే...నాన్నా...

బ : సరోజా...పట్టణం సంగతు లేమిటమ్మా చెప్పేవు గాదు.

స : ఏమున్నాయి. బాగా చదివి...పరీక్ష వ్రాశాను. పరీక్ష ప్యాసవుతాను. అప్పుడు నీవు బాగా సంతోషించి బహుమానం ఇస్తావు...అంతేనా?

బ : పిచ్చితల్లి...యీడొచ్చిన పిల్లవు...తల్లిలేనిదానివి...యింకెన్నాళ్ళు యీవిధంగా ఉంటావమ్మా...చూడు సరోజా...

నీకు పెళ్ళిచేయ నిశ్చయించాను. సంబంధం కుదిరింది... యింకా ఆరురోజులే ఉంది...

స : (కొంచెం నొచ్చుకొని) ఆరురోజుల్లో నా పెళ్ళా...ఏ ఊరు నాన్నా పెళ్ళివారిది...

బ : ఏ ఊరయితే ఏం తల్లి...మంచి సంబంధం...కుర్రవాడికి చాల డబ్బుంది...నీకు కావలసినన్ని నగలు...

స : నాన్నా...చాల డబ్బుంది...నాకు కావలసినన్ని నగలు... బాగానే ఉంది...అసలు ఏ ఊరు నాన్నా చెప్పవూ ?

బ : ఏ ఊరంటావా...శ్రీరాంపురం అనే చిన్న గ్రామము. ఒక భూస్వామి...

స : శ్రీరాం పురమా...(ఆశ్చర్యంగా) నిజంగానా నాన్నా.... నాన్న చాలమంచివాడు.. నాన్న సంగతి నాకు తెలుసుగా ...నాన్నా...

బ : సరోజా ... ఎంత పిచ్చిదానవమ్మా ... యీ కాలం పిల్లవుగాదు...నాచిట్టి తల్లి...మాటను జవదాటని తల్లి...

స : (సిగ్గుతో తల వంచుకుంటుంది)

బ : సరోజా ... నేనలా వెళ్ళొస్తాను ... యిల్లుచూస్తూ ఉండమ్మా...చాల పనులున్నయి...(వెళతాడు)

స : అలాగే నాన్నా... (బసవయ్య వెళ్ళిన తరువాత చందర్ ఫొటో చూస్తూ) చందర్... నీవేనా... శ్రీరాంపుర పెళ్ళి కొడుకువు ... (గోడమీద ఉన్న ఆదిలక్ష్మి పటాన్ని చేతి లోకి తీసికొని) అమ్మా...ఆదిలక్ష్మి... కలలన్నిటిని నిజం చేయి తల్లి... (అంటూ ఆడుతూ పాట)

జేజేలమ్మా . . జేజేలమ్మా . . . జేజేలు . . .
మా ఆదిలక్ష్మికి జేజేలు . . .
విందూలూ వినోదాలు
ఊరేగింపుల మేళాలూ ॥జే॥
ఓ ఓ.... పెళ్ళివారే వస్తారంటే . . .
నగలూ కూడ తెస్తారంటే . . .
ముస్తాబై నే వెళ్ళాలంటే
పెళ్ళికూతుర నౌతానంటే ॥జే॥
ఓ ఓ... చెలుల్లారా స్నేహితులారా
రారండమ్మా రారండి . . .
విందులు గుడిచి . . . దీవన లిచ్చి
పెళ్ళి పెద్దలు అవుదురుగాని ॥జే॥

అమ్మా ఆదిలక్ష్మి పాలముంచినా...నీటముంచినా...
నీవే... (అని నమస్కరిస్తుంది.)

(ఇంతలో తెరలో పాటపాడుతూ బైరాగి)

బైరాగి : (తంబుర వాయిస్తూ)

ఓ...

భారమయిన మన బ్రతుకులకే సన్యాసం బహుదగ్గరరా
ఆలోచింపక చేసిన పనులకు అనుభవింపక తీరదురా. . .
ముల్లు విరిగి ఒక ఆకున బడినా ఆకే ఎగిరి ముల్లున పడినా
ముల్లుకు నష్టం ఉండదురా . . . ఆకే భ్రష్టత చెందునురా...
సాంబసదాశివ సాంబసదాశివ సాంబసదాశివ సాంబశివోం.
ఆశకు లోబడకుమురా . . . ఆ ఆశే . . .
మోసము చేయునురా . . .

మోసపోయి అడియాసల పాలయి
జన్మను వీడకురా ... ఇది సత్యంరా ...
సత్యం నిత్యం తెలుసుకోరా ... ॥సాంబ॥
కలిమి లేములు కష్టసుఖాలు కావడికుండలురా
ఆపదలన్నీ దొంతర తెరలై అదేవిధముగా వచ్చునురా
యిది నమ్ముమురా ... నమ్మిన చెడేదిలేదురా ... ॥సాంబ॥

బై : (పాటనాపి ప్రవేశించి) ఎప్పు డొచ్చావమ్మా... చిట్టితల్లి.

స : రెండురోజు లయింది ... ఏం? యివ్వాళ చాల ప్రొద్దు పోయినదాక ఉన్నావు?

బై : ప్రొద్దుపోయింది తల్లి. ఎక్కడయినా ప్రొద్దుపోవల సిందేగా. యీ జన్మకు ... తెల్లవారేవరకు తెల్లవారే దెప్పుడనుకుంటాం ... తెల్లవారిన తరువాత, పొద్దుకూకే దెప్పు డనుకుంటాం. . .జీవితాలు శాశ్వతాలు కాదమ్మా... చిట్టితల్లి.

స : అన్నం కొంచెం పెడతాను ... తిను. (అని లోపలి కెళ్ళి అన్నం తెచ్చి బైరాగికి పెడుతుంది.)

బై : తినడం తేలికయినా చిట్టితల్లి ... జీవితం అంటే ముఖ్యంగా నీబోటి అమాయకులకు ... నాబోటి వృద్ధు లకు ఒకపరీక్ష ... యీ ప్రపంచనే ఒకతీరు. దాన్ని వ్యతి రేకిస్తే మానవుని ఆదర్శాలు నేల మట్టంకాక మానవు.

స : ఏమిటి తాతా వేదాంతం మాట్లాడు తున్నావు ...

బై : వేదాంతం ఏముందమ్మా ... ముక్కుకు సూటిగా నడచుకోక, హృదయమని గిదయమని అంగలార్చే వ్యక్తు

లకు చివరకు మిగిలిపోయేది చితికిన బ్రతుకు . . . మలిన మయిన శరీరం మాత్రమే.

స : తాతా. జీవితానికంత కష్టమయిన విచారం ఎందుకు కలిగింది చెప్పవూ ?

బై : ఎందుకు చెప్పనూ... ? "ప్రపంచంలో వాస్తవికత పనికి రాదూ" అని అంటున్నా.

స : అవును. యదార్థవాదికి ప్రపంచంలో జీవించటానికే అవకాశం లేదు.

బై : అవునమ్మా. అందుకే ఉన్నమాట అనకూడదు. అదే లౌకిక జ్ఞానం అంటారు. ఏ ఎండ కా గొడుగు పట్టేవారి జీవితమే మధురం.

స : అలా చెయ్యనందుకే...నీబోటివారికీ ఫలితం.

బై : అయితేనేం ... యిదే నాకు మధురమయిన జీవితం... చిట్టితల్లి...కాకిలా కలకాలం బ్రతికేకన్న హంసలా నీతి గలిగి నాలుగురోజులు బ్రతికినా చాలు.

స : సరేగాని ఒకమాట చెప్పనా.

బై : ఏమిటమ్మా ఆమాట ?

స : నా వివాహం జరుగబోతుంది... నన్ను దీవించి పంపవూ ?

బై : (సంతోషపడుతూ) చాల సంతోషం... పిచ్చితల్లి... నేనేమి దీవించి పంపుతాను. నాకు ఊరా పేరా...అన్నిటికి ఆ పరమేశ్వరుడున్నాడు... ఆయన అనుగ్రహం.

స : యిక ఆరురోజులు మాత్రం.

బై : శుభం.

స : తాతా... నా పెళ్ళికి నీవుకూడా రావాలి... తప్పకుండా వస్తావు గదూ.

బై : నేనెందుకమ్మా... చూడుసరోజా... జీవితాల కనువయిన మాటలు కొన్ని చెప్తాను... వింటావా?

స : ఊఁ, చెప్పు.

బై : చూడు...చిట్టితల్లి... జీవితంలో నిజంగా ఎవరి బ్రతుకూ స్వంతంగాదు. ముఖ్యంగా ఆడవాళ్ళ బ్రతుకుల్లో అడుగడుగునా అవరోధాలు కల్పించింది సంఘం. యీ ప్రపంచం అంతా ఒక నాటకం... జీవితంలో వివాహం అనేది ఒక బంధనం... దాన్నుంచి ఎవరూ తప్పించుకోడానికి వీల్లేదు. సంఘంలో కరుడుగట్టుకుపోయిన ఆచారాలమధ్య తార్కికంగా జీవితం గడపటం కేవలం అసంభవం. కాలం కలిసివస్తే ప్రతాపం అనుకుంటాం... కలసిరాకపోతే కర్మ అనుకుంటాం... చిట్టితల్లి... వివాహం అంటే రెండు రక్త బిందువులకు సమ్మేళనంచేసి ఒక పథంలో నడపటం. కాని యీ రోజుల్లో ప్రపంచం అంతా రెక్కలు విరచి తనకు కట్ట బెట్టింది తనది. అలాంటప్పుడు సరాకరిస్తున్న హృదయాన్ని గదమాయించి, వెక్కిరిస్తున్న మనస్సును తొక్కిపట్టి, తనకు లభించిన వస్తువును నమ్ముకొని జీవితం గడపాలి.

కాలం ఒకగోడ లాంటిది. అది యీ క్షణానికి ... నేటికి ... రేపటికి మధ్య అడ్డై నిలచి భ్రమపెడుతుంది.

యీ క్షణం మనవికాని సుఖాలు మరుక్షణమే తమకు తామే పరుగెత్తుకొని వచ్చి వడిలో రాలిపోతయి.

జీవితంలో మనం చాల ఋణాలు తీర్చాలి. యీ బ్రతుకుల్ని యీ చదువుల్ని ... యీ ప్రపంచాన్ని చూస్తే ఒక్కొక్కప్పుడు జీవితంమీద విరక్తి పుడుతుంది. అడవుల్లోకి పారిపోయి ఆత్మహత్య చేసుకోవా లనిపిస్తుంది. అది క్షమించడానికి వీలులేని మహాపచారం.

జీవితం జీవించడానికే ..జీవితమాధుర్యం జీవిత సమస్యల నెదుర్కొనడంలోనే ఉంది. చింతలకు కష్టాలకు వెరచి పిరికిపందవలె పారిపోవడంలో జీవితమాధుర్యం లేదు. అదే మానవుని జీవితం.

స : తాతా ... నీవు మాట్లాడే దాంట్లో ఎంత అంతరార్థం ఉంది. నా జీవితాన్నంతా నాకు చెప్తున్నావా ... లేక నీ జీవితాన్ని వినిపిస్తున్నావా ? అయినా ... జీవితం అంటే నిజంగా తెలుసుకున్నవాడవు నీవు.

బై : తల్లీ...యిన్ని కష్టాల్లో నేనార్జించింది యింతేగదమ్మా. సుఖంగా పోయి ... పుట్టినింటికి మెట్టినింటికి పేరు తీసుకు రామ్మా.

స : నిజంగా యీలాంటి ప్రపంచాన్ని ... సంఘాన్ని ... ఎదుర్కొని ఆదర్శవంతంగా నిలబడితే...

బై : పిచ్చిపిల్లా...లోకం సంఘం ఉన్నాయి. అవి...యింకా చావలేదు. వాటిని ఎదుర్కొంటే పునాదిగోడలు పూర్తిగా పూడి పోతయి. నిలబడటానికి వీలుండదు.

స : అందుకని ... నీతి లేకుండా ... గోతిలో పడుతుంటే చూస్తూ ఊరుకుంటామా ?

బై : కాదు. తల్లి ... కాలం కలసివస్తే ... నీళ్ళైపాలయి పోతయి...అంతే మానవుడు కష్టించినా ఫలితం ఉండదు. మానవుడు పరిస్థితులకు బానిస.

స : కాదు...యీ ప్రపంచం ... యీ కాలం ... యీ మానవుడు...అన్నీ మారిపోయి...మానవుడు సుఖంగా ఆదర్శవంతంగా జీవితం గడపేరోజులు ముందొస్తున్నయి.

బై : పిచ్చితల్లి...కలలు గంటున్నావా? ఎప్పుడూ మారదు. సంస్కారం ... సభ్యత ... నాగరికత పెరిగినకొలది... మానవజాతి...నీతి...నిజాయితీ పతనం అయిపోతున్నయి. అలాంటప్పుడు ... యీ కాలాన్ని సుఖంగా చూస్తా మనుకోవడం...వట్టిభ్రమ...ఆలోచించుకో తల్లి...నిజంగా... యీ విశాలప్రపంచంలో "నీతి" అన్న వస్తువు ఎవరన్నా ఉన్నారా? ఒక్క నీ నీడతప్ప. నిన్ననుసరించేవారు ఎవ్వరూ లేరు.

స : తాతా...వేదాంతం వింటూంటే నిజంగా విరక్తి పుడుతుంది...మనమంతా నిజంగా పరిస్థితులకు బానిసలమేనా?

బై : సరే వస్తాను. సుఖంగా పోయిరామ్మా (వెళ్తాడు)

స : (తనలో) లోకం సంఘం ఉన్నాయి. అవి ... యింకా చావలేదు. వాటిని ఎదుర్కొంటే పునాది గోడలు పూడి పోతయి... అబ్బ ... ఏమిటీ ప్రపంచం ... నిజంగా అర్థంగాని...ఒక అగాధం...

(అంటూండగా తెర)

# 3 వ దృశ్యము

[మొదటిసీనులో మాదిరి స్టేజిని ముందు వెనుకభాగాలుగా రెండుగా చేయవలయును. స్థలం. జానకిరామయ్యగారిల్లు. ఒక పెద్ద హాలులాంటి గది. అక్కడ సోఫాలు కుర్చీలుంటయి. సమయం షుమారు ఉదయం 9 గం. ప్రాంతం. చందర్ సోఫాలో పడుకొని చదువుతూ ఉంటాడు. చదువుతూ చదువుతూ లేచి పుస్తకాన్ని అక్కడపెట్టి కూనిరాగాలు తీస్తూంటాడు.]

చందర్ : రాగము పాడగదే...
వీణా రాగము పాడగదే...

(యింతలో ప్రవేశం జానకి రామయ్య)

జా : ఏరా... చందర్... యిట్లా ఎప్పుడూ ఆటలతో పాటలతోటే కాలం గడపితే జీవితం ఎలా గడిచేది?

చం : (ఆలోచిస్తున్నట్లు నటిస్తూ) ఏం నాన్నా? నే నెప్పుడూ ఆటలు ఆడుతూ పాటలుపాడుతూ ఉంటానా?

జా : (వ్యంగ్యంగా) నీ వాటలు ఆడటం... పాటలు పాడటం... నీకు తెలియకుండానే జరిగిపోతయి అనుకుంటా.

చం : (యీసడింపుగా) ఎదురు మాట్లాడితే ఎవరికయినా కోపంగాని సాయంకాలం టయింలోకూడ ఆడుకున్నా ఎప్పుడూ ఆటలేనా అని ప్రశ్నిస్తే.

జా : మరి యీవిధంగా ఉండాలనే ఉందా... ఏమయినా ఉద్యోగం చూసుకుంటావా?

చం : ఏం ఉద్యోగం చెయ్యమంటారు?

జా : ప్రతిదీ నేను చెప్తే చేస్తావన్నమాట. చాల బాగుంది. చందర్ యిటుచూడు. నీ వయస్సు యిప్పటికి రెండు దశాబ్దాలు. యిక నీ బాధ్యత నీవు తెలుసుకోకపోతే ఎలా

చెప్పు. వుద్యోగం పురుషలక్షణం అన్నారు. కనీసం ఉద్యోగం వివాహం అయిందాకనన్నా చెయ్యాలి.

చం : వివాహం అయిందాకా ఉద్యోగమా...యీ రెండిటికి గల సంబంధం.

జా : పెళ్ళినాటికి ఉద్యోగంలో ఉంటే నీకు విలువ ఎక్కువ. ఆ విలువ కోసమే యీ రాద్ధాంతమంత. అయినా ఆడది కూడ ఉద్యోగంచేసే యీ రోజుల్లో ఎందుకలా జడుస్తావు.

చం : అయితే పెళ్ళికోసం నన్నుద్యోగం చేయమంటున్నారన్న మాట. యీ విధంగా అయితే నేను B. A. వరకూ చదివి ఉండే వాణ్ణే కాదు.

జా : అయితే నీ ఉద్దేశ్యమేదో గట్టిగాచెప్పు.

చం : నాన్నా...వివాహం అనే సమస్యతో నా జీవితాన్ని బానిసబ్రతుకు చేయబోకండి.

జా : బానిసలు...బానిస బ్రతుకు లెవరివి... పనివాళ్ళ బ్రతుకులు బానిస బ్రతుకులు కాని ఉద్యోగస్థుల బ్రతుకులు...

చం : (మాటనందుకుంటూ) పొరబడుతున్నారు. ఉద్యోగస్థులు పనివాళ్లు అంతా ఒకటే. అయినా నాన్నా ! పనివాళ్ళు బ్రతుకుకోసం బానిస లవుతున్నారుగాని బాల్యంలో బానిసలుగారు. నేనూ ఉద్యోగం చేస్తూఉంటే నాకంటె పై ఆఫీసరు నన్నూ అలాపిలిస్తే మనకు నొచ్చుకోదా ? జానెడు పొట్టకోసం చేరిన ఆ పేదవాళ్ళ నలా శీతకన్నుతో చూస్తే ఎలాచెప్పు.

జా : మాటలు బస్తీకి తగ్గట్లు నేర్చుకున్నావన్నమాట.

చం : సభ్యతగా మాట్లాడ్డం కూడ మాటలు నేర్చుకోవడమే నన్నమాట.

జా : అయితే నే నసభ్యంగా మాట్లాడుతున్నా ననా ?

చం : ఆ మాట నే నన్నానా? ఎందుకలా ఉలిక్కిపడతారు ? నాన్నా ! ఉద్యోగం చెయ్యమన్నారు బాగుంది. కాని యీ నాటి ఉద్యోగాలు నిజాయితీ గలిగినవారికి లభ్యంకావడం అరుదు. మనబోటి వారంతా ఉద్యోగాన్వేషణకు బయలు దేరడమే మధ్యతరగతి వారి కవి దూరమయి పోతున్నయి. ఉద్యోగం కావాలంటే చదివితేనేరాదు. నాలుగు మాటలు పదిపేర్లు చెప్పగలిగి పైవారి అడుగులకు మడుగులొత్తుతూ "ఊ" కొడుతూ ఉండాలి. మన కీ ఆ స్తిపాస్తులు లేకపోతే కనీసం ఏదైనా వెదకిఉండేవాణ్ణి. విజ్ఞానంకోసం విద్యాగాని వినోదంకోసం గాదు నాన్నా.

జా : అయితే నా ఆశలన్నీ అడుగంట వలసిందే నన్నమాట.

చం : నాన్నా... తాను నమ్మిన న్యాయానికి ఆదర్శానికి కట్టుబడి ఆత్మ బలిదానమయినా చేసే యీరోజుల్లో యింత మాత్రం త్యాగం లేకపోతే యింక భారతదేశం స్థిరపడే అవకాశం ఉన్నదా ? అయితే ఆశ... అనిఅంటావు... అంతేనా... ఆశ... ప్రతి కన్నకడుపుకు ఆశ అనే ఒక అజ్ఞాతమయిన శక్తి అయస్కాంతంలా ఆకర్షిస్తుంది... తనకన్న బిడ్డలను బాగుచేయాలనిపిస్తుంది, నిజమే... ప్రతి కన్నబిడ్డకూడ ఆ ఆశను నెరవేర్చడానికి సాధ్యమయినంత వరకు ప్రయత్నించాలి. అతీతంగా గాకుండ ఉండేనరకు దాన్ని వినియోగించుకోవాలి. కాని... వివాహం కోసమని

నేను శాసనను కాలేను. క్షమించాలి... యిది... సంస్కృతి గలిగిన ఒక భారతదేశం.

జా : (నిట్టూరుస్తూ) హుఁ! పెరిగి పోయావు.. ఇప్పుడు అలవి గాని ప్రమాదము... అవును...కన్నాం పెంచి పెద్దవాళ్ళను చేసి చమటోడ్చి చదువు చెప్పించాం. ఆ ప్రసుస నీకు పనికి రాని వాళ్ళమయి పోయాం. కాలం మారిపోయింది ... యిది సంస్కృతిగల భారతదేశం ... అసలు సంస్కృతి అంటే ఏమిట్రా.

చం : సత్ప్రవర్తనే సంస్కృతి...యిది భారతావనికి ... ఆరని అమర జీవి నాశనం దేశం.

జా : అయితే చందర్ ... మీనాన్న నిలా అడియాసలోనే ఉండమంటావు కదూ...నీకోసం కష్టపడి...లేదు కాదనక ... మా నరాలసత్తువ నంతా వినియోగించిన ఫలితం కన్నాం ... ఉద్యోగం చెయ్యకపోవటం సత్ప్రవర్తనా ... ఏమిటి నీ మాటలు...యింట్లో యిష్టం వచ్చినంత స్వేచ్ఛ యిచ్చామనా...నెత్తినెక్కి కూర్చున్నావ్ ...

చం : హుఁ! నాన్నగారూ ... స్వేచ్ఛవల్ల లాభం లేదు. అది లైసెన్సుగా మారిపోయి అరాజకానికి దారితీస్తుంది. శాసనంవల్ల లాభంలేదు. అది నియంతృత్వంగా మారిపోయి క్రౌర్యానికి దారి తీస్తుంది. నిగ్రహం...ఆత్మనిగ్రహం ... ఒక్కటే సరియయిన నినాదం ... యిదే భారతీయ సంస్కృతి.

జా : చందర్...నీవిలా మారిపోతావని నా కలలోకూడ అనుకోలేదు.

చం: నేనెలా అయిపోయాను నాన్నా ?

జా: ఎలా అయిపోయావా ? ఎదురు తిరిగి ముదిరి పోయావు.

చం: కాదు బాగుపడి సుఖపడబోతున్నాను. నాన్నా యిది నీ, నా మధ్య జరిగే సంఘర్షణ. కేవలం వ్యక్తులమీద ఆధార పడిలేదు. రెండు సిద్ధాంతలమధ్య పరస్పరంగా జరుగుతున్న యుద్ధం లాగుంది.

జా: సరే ఆ యుద్ధంలో నేనే ఓడిపోయాననుకో. (వెళతాడు)

చం: సంస్కారం ... సభ్యత ... యీ రెండు సంఘంలో క్షీణించిపోయి...మానవుని ఆశయాలను ... ఆదర్శాలను నేలమట్టం చేస్తున్నయి.

(యింతలో ప్రవేశం గంగులు)

గం: సినబాబుగోరు ఏదో ఆలోసిత్తన్నారే.

చం: ఏం లేదు. జీవితమంటే నిర్వచనం దొరకటంలేదు.

గం: జీవితమంటే తెలుసుకోటానికి సన్యాసి కావాలి ముందు. అప్పుడు ఏదాంతం నేర్చుకుంటే తెలుత్తుంది జీవితమంటే.

చం: నీకెలా తెలుసు గంగులూ.

గం: యీావరకి సాలమంది ఏదాంతులు మనయిల్లకు వచ్చే వారు. ఆ ఏదాంతుల్ని కదిలిత్తే సరి మనకర్థంకాని బాస మాట్లాడే వారు. అప్పుడు మీాది సిన్నవయసు లెండి.

చం: ఎందుకు నేర్చుకోలేదు నీవుకూడా...గంగులూ.

గం: నీవుకూడ ఎందుకు నేర్చుకోలేదంటే ఎట్లాగండి...దాని సిగతరగ మీాలాగ సదువుకుంటే అది వత్తది...దాని తాత వత్తది.

చం: పాపం ఎంత అమాయకుడవు.

గం : సిన్నబాబుగోరూ నాకు తెలవకడుగుతాను...దాని సిగ తరగ యిప్పుడు సదువుకోవాలనిపిత్తదేంటండో.

చం : అది మానవ సహజం గంగులూ.

గం : అందుకే మన సూరయ్యగారికి యిప్పుడు పెల్లిచేసుకోవాలనిపించి చేసుకుంటున్నాడు.

చం : అవున్నా... యిప్పుడు చేసుకోంటాడు ... చావబోయే నాడూ పెళ్ళంటూనే చస్తారు...అలాఉంది...ప్రపంచం.

గం : పాడుపెపంచకమండి. సిన్నబాబుగారు వయసుమళ్ళినా ఆయనెందుకో మల్లీ పెళ్ళిసేసుకోడం.

చం : ఎందుకా ? చిన్నపిల్లల మెళ్లోపుస్తె తొందరగా ఖాళీచేసి ఉంచటానికి...సరేగాని స్నానానికి నీళ్ళు తోడుతావా ?

గం : సిత్తం చిన్నబాబుగోరూ (వెళతారు)

[గది మామూలుగానే ఉంటుంది రెండో కర్టెన్ తొలగిపోతుంది. నేపథ్యంలో పెళ్ళిజరిగినట్లు చూపించాలి. బాకాబాజాలు మ్రోగుతున్న శబ్దం. సంగీతం, వాయిద్యాలు, మంత్రాలు, మాటలు, కలకలాల శబ్దాలన్నీ ఫేడౌట్. టయిం షుమారు ఉదయం 9½ ప్రాంతం. స్థలం సూరయ్యగారిల్లు. సూరయ్య మంచంమీద పడుకొని ఉంటాడు. సరోజ క్రింద కూర్చొని ఉంటుంది. నేపథ్యంలో]

"పెళ్ళి జరిగిన కొన్నాళ్ళకు" (అని మైక్‌లో చెప్పాలి)

సరోజ : (విచారంగా) ఏమండి. యీ పూటకూడ తిన్నగా భోజనమయిన చేయలేదు. చూడగా నాకోసంలాగుంది వండుకోవడం. యిలా అయితే ఎలా చెప్పండి.

సూ : లేదు. సరూ, నాకివ్వాళ ఆరోగ్యం ఏమీంబాగుండలేదు.

స : ఆరోగ్యం బాగుండలేదని ఊరకనే ఉంటే ఎలాగండి ? ఏదైనా మందు తీసుకోరాదూ డాక్టర్ని పిలచి.

సూ : (దగ్గుతూ) నన్ను మాట్లాడించకు సరూ... అబ్బ యీ దగ్గు నాతో పోవలసిందే. (దగ్గుతాడు)

స : మీరిట్లాంటి మాట లనబోకండి. ఎప్పుడూ దగ్గుతుంటే ఊపిరితిత్తులు దెబ్బ తింటయి. చూడండి. బయట పిండార బోసినట్లు వెన్నెల...చల్లటిగాలి. నాకిట్లో కుర్చీ వేసుకొని చల్లగాలికి హాయిగా ... కూర్చుంటే మీకు కావలసినంత మనశ్శాంతి.

సూ : హాయిగా చల్లగాలికి నీవేపోయి ఆనందించు.

స : అయ్యో ... యింతలో నేనే మన్నాను, అలా కసురుకుంటారు. నేనేమన్నా మీకలా కోపమయితే యిక నేను మాట్లాడ్డం దేనికి ?

సూ : నేను నిన్ను మాట్లాడ మన్నానా ?

స : అయితే భార్య అన్న తరువాత మంచిచెడులు చూడ గూడ దాండి.

సూ : నేను నిన్ను పెళ్ళిచేసుకుంది ... మంచిచెడులు చూడ్డానికి కాదు. నేను నిన్ను దాంపత్య సౌఖ్యానికీ చేసుకోలేదు.

స : అయితే వేడుకకు చేసుకున్నారా. (కన్నీరు కారుస్తూ) అవును. రాను రాను మీ మతి చలించి పోతున్నది. హుఁ ! జన్మఎత్తిన తరువాత వివాహం ఒక ఉల్లంఘించరాని ఆచారమయి పోయింది.

సూ : ఏయ్ ఏమన్నావ్. (కోపంగా) నోటికి వచ్చినట్లు ప్రేలకు. నిన్ను ఊరకే చేసుకోలేదు. నా కష్టార్జితం అయి దెకరాలు వ్రాసియిచ్చాను.

స : మీ కష్టార్జితం అయిదెకరాలు నన్ను కష్టపడమని అర్పిస్తున్నారా? పెళ్ళామంటే యింట్లో వెట్టిచాకిరీ చెయ్యడానికి బానిసగాదు. పురుషునికి స్త్రీనుండి లభించవలసింది వెట్టి చాకిరీ తప్ప యింకేమి లేదనుకున్నారా? అవును. ఆర్థికంగా తలఎత్తలేని భారత దేశంలో, సనాతనాచారాల మధ్య సంఘం ఆడదానికి చేస్తున్న ఉపకారం సతీమణిని చెయ్యడమే. అక్షరం ముక్క నేర్చుకోడానికి కూడ నోచుకోని యీ ఆడముఖాలు పురుష కారానికి తమ మట్టి బొమ్మల్నప్పగించి మురుగ్గుంటల్లోని పురుగుల్లాగ దాటి పోవలసిందేనా?

సూ : ఏం...నీవు బాగా చదువుకున్న దానివేగా?

స : అవును. చదువుకున్నాను. జీవిత సుఖాలు త్యజించి యీ కూపంలో దిగాను.

సూ : పిచ్చిదానా! జీవితంలో ఎవరి సుఖాలు వారివి.

స : అవును. మనది మనస్సుకు పట్టని ఆధ్యాత్మికం...పనికిరాని వేదాంతం...అక్కరకురాని ఆదర్శాలు. జీవితంలో పరస్పర హృదయా లంటుకోని రాగాలాపనలు మన బ్రతుకులు.

సూ : సరోజా...ఆదర్శాలు అక్కరకురాని వయితేనే...ఆడదానికి సంఘంలో చెడిపోవడానికి ఆస్కారం అవకాశంఉంది.

స : అవును. ఆడదానికి సంఘంలో చెడిపోవడానికి ఆస్కారం ఉంది.

సూ : (దగ్గుతాడు) అబ్బ. యిక నయిందా నీ ఉపన్యాసం. అబ్బబ్బ. నాకు తలనొప్పిగా ఉంది.

స : యీ ఆస్ప్రోబిళ్ళ తినండి మొన్ననగా తెచ్చారు. (అని బిళ్ళ నందిస్తుంది.)

సూ : అబ్బబ్బ...నన్ను విశ్రాంతి తీసుకోనీయి.

స : తన జీవితానికి సౌఖ్యం లేకపోయినా ఎదుటివారి సౌఖ్య మన్నా సరే ననాలి ... (సూరయ్యతో) సరే విశ్రాంతి తీసుకోండి.

సూ : (నిట్టూరుస్తూ) అమ్మ యిప్పటికి శాంతి లభించింది. (నిద్రిస్తాడు).

[ క్షణం సేపు నిశ్శబ్దం. సరోజ దిగాలుగా కూర్చుంటుంది. అటూ యిటూ తిరిగి ప్రక్క కెళ్ళిపోతుంది ]

సరోజ : (దిగాలుగా కూర్చొని) హుఁ! జీవితంలో విధిగా నిర్వర్తించవలసిన పనులు కొన్ని ఉన్నయి. యిది మానవుడు సౌఖ్యం కోసం నిర్మించుకొన్న ఆచారంగాదు. గుడ్డిగా అనుసరిస్తున్న త్రోవ. క్షణిక దౌర్బల్యంచేత మా నాన్న ఎంత పొరపాటు చేశాడు. అప్పును. పెద్దల తప్పులకు పిల్లలు బాధ్యులు. (క్రమంగా నిద్రిస్తుంది.)

(నేపథ్యంలో)

(పాట) సాఖి :

అయ్యయో... యీ దారితెలియని అబల
జీవితానికిక సుఖమే శూన్యమా ? యింతే
నా,... యిదేనా... ?

పల్లవి : యిదే...అబలజన్మా... యిదే అడ
జన్మా... క్షమించరాని తప్పులకే
ఫలితము పాపలకేనా...? పాపలకేనా...?

సాకీ : ఓ...ఓ...ఓ... కాలమంతా యీలా కటిక
చీకటికాగ...కన్నీరు...వ్యధలు...ఎద
లోన మిగిలెనా? యింతేనా?

పల్లవి : ఏమికాలమమ్మా... యిది ఏమిబ్రతుకమ్మా
ఆపదలన్ని మీలాటివారి పాపలకేనమ్మా
పాపలకేనమ్మా... ॥ఇదే॥

(పాటశబ్దం ఫేడౌట్ అవుతుండగా తెర)

# 4 వ దృశ్యము

[ స్థలం. జానకిరామయ్యగారిల్లు. చందర్ కుర్చీలో కూర్చొని ఉంటాడు. జానకిరామయ్య చందర్ కెదురుగా కూర్చుని ఉంటాడు. గంగులు చందర్‌కు ప్రక్కగా కూర్చొని ఉంటాడు. సమయం ఉదయం 9 గం. ప్రాంతం. స్టేజి మామూలుగా మొదటిసీనులో మాదిరి ఉంటుంది. ]

జాన : అదిరా అబ్బాయి నా ఉద్దేశ్యం. పిల్ల చాల అందమయినది. బుద్ధిమంతురాలు. చదువుకుంది. కొద్దిగా సంగీతం వచ్చు. తల్లి, తండ్రి ఆస్తంతా పిల్లకే వస్తుంది. మగపిల్లలు లేరు. అయినా ముప్పయివేలు ఖరీదుచేసే ఆస్తంటే మాటలా యీ రోజుల్లో. అందుకే నిన్నర్జంటుగా రమ్మని పిలచాను. పెళ్ళివిషయంలో వాళ్ళేమో తొందరపడుతున్నారు. వీలయితే ఎంత తేలికలో, అంత తొందరగా అయితే మంచిదన్న ధోరణిలో ఉన్నారు. బంగారంనూటయాభై శవర్లుంది. పద్ధానుగు సంవత్సరాల వయస్సు. నీ మామగారు డిప్టీకలెక్టరు. పిల్ల కాయ నిన్నిదివరకు చూసి ఉన్నదట. మరి నీవుకూడ పిల్లను చూచి మాట్లాడి... నీ నిశ్చయంకూడ తెలిపితే ... ఆ తరవాత కార్యక్రమం యథావిధిగా సాగించటానికి వీలుగా ఉంటుంది.

చం : (అనుమానిస్తూ) స... రే... లే.

జా : అట్లా నసుగుతూ చెప్పకు. నీ కేమయినా సందేహం ఉంటే యిప్పుడే చెప్పు.

చం : (ఏమీ మాట్లాడడు)

జా : మాట్లాడకుండా ఉంటేగాదు. మళ్ళీ అవతల మాట పోతుంది.

గంగులు : సిన్నబ్బాయి గోరంతేలెండి. నాకు వసుధా అంతే లెండి. వారి మాటతీరే అంతలెండి.

చం : అని ఎవరన్నారండి.

జా : యిప్పుడేమీ అనలేదులెండి.

చం : (యీసడింపుగా) నాన్నా ...నాకన్నీ తెలుసు ... ఏమీ చెప్పక్కర్లేదు ...నన్ను మాట్లాడించకండి.

జా : (కొంచెం నొచ్చుకొని) ఏమిట్రా నీవనేది. మాకేమీ అర్థం కావటంలేదు. యింతకు ముందు సరేలే అంటివి. నిక్కచ్చిగా అడుగుతుంటే యీసడింపుగా మాట్లాడు తావూ ? పోనీ నీ ఉద్దేశ్యమేమిటో చెప్పరాదూ ?

గం : సిన్నబ్బాయిగోరు తేల్చి జెప్పరాదటండి ... ముసలా యన్నెందు కలా బాధపెడతారు.

చం : గంగులూ ... జీవితంలో ఏఘట్టాని కాఘట్టాని కొక మార్పు ...నాకసలు పెళ్ళే అక్కర్లేదు.

గం : సిన్నబ్బాయిగోరూ ... కాలం ఎప్పటి కప్పుడు మారి పోనటం లేదండీ ...చెట్టు <u>పూసపూసి కాయయి పండయి పోవటం లేదండి...అట్టాగే మడిసిగ్గోకూడ మార్పు.</u>

జా : ముచ్చటగా ముసలివాళ్ళ మూడోపెళ్ళి చేసుకొని హాయిగా ఉంటూంటే ... వయసొచ్చినవాడి కీ బాధ ఎందుకు ... యింతకూ నాకు వీడి వివాహం చూసేవ్రాత లేదురా గంగులూ.

గం : కాదులెండి బాబు...నాలుగు రోజు లాగండి ... మా సిన్నబ్బాయిగోరు సాలమంచోరు లెండి.

జా : నాలుగు రోజులు సహం ఆగితే వాళ్ళు ఆగుతారా... ముప్ఫయి వేలురా కట్నం.

గం : అబ్బ కళ్ళు తిరిగిపోతున్నాయి ... మా చయ్యాటి రాజయోగం బాబు... అదృష్టం.

జా : ఏది... అందాక వస్తే కదా ?

చం : నాన్నా ! నేను కాలేజికి వెళ్ళి సర్టిఫికెట్ తెచ్చుకుంటాను. యీ మనోబాధలో గ్రుడ్డో గుడ్డో ఏదన్నా ఉద్యోగం చూచుకుంటాను... వెళ్తున్నా. (వెళ్తాడు)

జా : కాలేజికి వెళ్ళడానికి యిప్పుడెక్కడ బండి ఉందిరా ? రైలుటయిం దాటిపోయిందిగా. (గంగులువంక చూస్తూ) చూడరా ... యిది తంతు ... తనకు తోచదు. ఒకరు చెప్పింది వినడు.

గం : కాలం మారిపోయింది దొరా... యింక మనం ఆరికేమీ సెప్పటానికి యీల్లేదు. సెపితే మనపరువే పోతంది.

జా : ఏమిట్రా పిల్లసన్నాసులు. నిన్నగాక మొన్న కళ్ళు తెరిచారు. వాళ్ళేమిటో తెలుసనుకుంటారుగాని నాకు చూడబోతే యీ సన్నాసులకు గడ్డిపోచకూడా తెగదనుకుంటా ?

గం : ఆఁ! ఏమిటో గడ్డిపోచదాక పోయారు. యీ సదువుకున్నాళ్ళు ఏ ఉద్దోగాల్లేక అటుయిటుకూడ సెడిపోతారు ఎందుకు పనికిరాకుండ.

జా : అట్లాఉన్నయి నేటిచదువులు, ఉద్యోగాలు. ఏమిటో లేరా... యింకనూ వాడి బ్రతుకెలా తెల్లవారాల్సిఉందో ఎవరి ఖర్మకు ఎవరు బాధ్యులు... ?

(ఎవరో పిలిచినట్లు వినబడుతుంది)

జా : గంగులూ... ఎవరో చూడు.

గం : (వెళ్ళిచూచి) వారేనండి... రాజారాంగోరు.

(ప్రవేశం రాజారాం)

రా : (ప్రవేశించి) ఏం...? బాబాయి.

జా : ఆఁ! ఆఁ! రా... కూర్చో.

రా : ఏమీలేదు. మొన్న నీవన్నమాట...

జా : ఏమిటి ఏమయిందేమిటి?

గం : ఊరకరారు మహాత్ములు... ఏదో యెంటేసుకొచ్చారే.

జా : గంగులూ...నీవు వెళ్ళవతలకి (గంగులు వెళతాడు) ఆఁ! ఏమిటీ? ఏమన్నావ్.

రా : ఏమీలేదు. పోయాను. మాట్లాడాను. అంతా అయి పోయింది...కాని...

జా : కాని...అని నీళ్ళు నములుతావేం? ఏం జరిగిందేమిటి?

రా : ఏం జరగటానికి ఏ ముందనుకో...అసలు మేనేజర్లు... ఎంత చెపితే అంతే ననుకో...ఆ మాటకొస్తే ఆఫీసరయినా మనం ఎక్కడ నిలబడాలంటే అక్కడ నిలబడాల్సిందే... కాని...గడ్డురోజులని వాడు అడ్డుపుల్ల లేస్తున్నాడు. గవర్న మెంటు యిదివరలా కాక యిపుడు కొంచెం పట్టి విడు స్తున్నదట. ఏది ఏమయినా మేత పడందే వాడు మెత్త పడేట్టు లేడు...ఒక్క పదివేలయినా మనవి కావనుకొని గిరగిర త్రిప్పి వాడిమొఖాన కొడితే...

జా : యింతకూ... ఆ "వాడు" అనేవాడు ఎవడా అని.

రా : ఆఁ! యింకెవడు...ఆ సర్కిల్ యిన్స్పెక్టరు.

జా : వాడికి...ఆ మిల్లు మేనేజరు నరహరిరావుగారి ద్వారా చెప్పిస్తే...

రా : అబ్బే...ఏమాత్రం లాభంలేదు.

జా : పదివేలు...మన పనిఅయితే బాగుంటు...యిది ఎవడిదో కదా ... (అనుమానంగా) ఆలోచిస్తానులే.

[అంటూండగా చందర్ ప్రవేశిస్తాడు. జానకిరామయ్య రాజా ఆశ్చర్యంగా చూస్తారు. రాజా ప్రక్కకు తప్పుకుంటూ]

రా : వస్తానే బాబాయి.

చం : వస్తావులే ఆగు.

జా : దేనికిరా వాడు...నీకు పిచ్చి ఎక్కినట్లుంది.

చం : నాకుగాదుపిచ్చి ... పిచ్చి అనుకొనేవాళ్ళకు పిచ్చి. రాజా...నీవు వచ్చినపనికి కారణం... ?

జా : నీకెందుకు వాడి రాకకు కారణం ... ఏదో అనేక పను లుంటయి... ?

చం : నాన్నా ... కారణం చెప్పకపోయినా నేను వింటూనే ఉన్నా...గోడకు చెవులుంటయ్యని మరచి పోయారా... (రాజ్ వైపు తిరిగి) రాజా పావురాను సూరయ్య యిల్లు లాంటి యిల్లనుకొన్నావా? యింకా యీ యింటికి దిక్కు నేది ఉంది. (జానకిరామయ్యతో) నాన్నా ... పేరు పడిన కాంగ్రెసు వాదులంతా దేశానికి యిలాంటి కుళ్ళు సరు కును...దేశద్రోహులను కూడగట్టుకొని ఖూనీకోరులను ... త్రాగుబోతులను ... విడిపించడానికి, గవర్నమెంటు ఉద్యోగులను అవినీతి పరులుగా మార్చడానికి, ప్రయత్నిస్తు న్నారు కదూ ... ఖూనీకోరు...ఎప్పుడూ ఖూనీకోరే ...

వాడికి శిక్ష ... శిక్షగానే ఉండాలి. శిక్షను తప్పించడానికి లంచం యిచ్చి గవర్నమెంటుకు ద్రోహం చేద్దామనుకున్నారా ?

జా : కాలేజికి వెళ్తానంటివి. మళ్ళీ ఎందుకొచ్చావ్.

చం : ఎందుకా ? బండి అందలేదు...యిందుకే కాబోలు... "యీ మోసగాడు యింకా ఎన్ని కొంప లార్పుతాడో" అని.

రా : చందర్...నన్నెందుకలా ఆడిపోసుకుంటావు.

చం : అయితే మా నాన్నగార్ని ఆడిపోసుకోమంటావా ? యీ పనికి ప్రోత్సాహం యిచ్చేది నీవా ? మా నాన్న ...(నాన్న వంక తిరిగి) నాన్నా పదివేలు ఎక్కణ్ణుంచి తెస్తావు...నోటి దగ్గర కూడు బోర్లపోసుకోవడం కాకపోతే ఏమిటి యీ పనులు.

జా : ఉపన్యాసం చాలించి నా ఎదుట లేకుండా అవతలకు పో.

చం : పోతాను...నాన్నా పోతాను...యిది భారతదేశం... యీ దేశంలో దేశద్రోహులు శిక్షితులయేవరకు శిక్షింపబడవలసిందే...అలాకాక లంచాలతో వదలించావా... నిన్నూ...నన్నూ ... యీ కొంపనూ...నిలువునా భక్షిస్తారు...(రాజావైపు చూస్తూ) రాజా ... నోరులేని పేద పడుచుల జీవితాలను నాశనంచేసి కాలక్షేపంచేస్తూ ఉండటంతో సరసుడ నయినా ననుకున్నావా ... ? చూడు... ఆమె పంజరంలోని పక్షిలా తన్నుకుంటుంది ... రెక్కలు విరిగి. అదేనా విశాల భావాలు గల యువకుని కర్తవ్యం... అదేనా నీ దూరదృష్టి...అదేనా నీపురుషలక్షణం...అదేనా నీఆదర్శం...అదేనా నీ ఆశయం... అదేనా...

రా : (కోపంగా) షటప్... (అని చెంపమీద కొడతాడు)

చం : యూ... (అని చేయి రాజా చెంపవరకు పోనిచ్చి ఆపు తాడు.) రాజా... నీలాంటి మూర్ఖుణ్ణి కాదు. యిప్పుడు మళ్ళీ నేను చేయి చేసుకుంటే నీకు ఎవరూ అడ్డంరారు. మర్యాద యిచ్చి మర్యాద పుచ్చుకో...

జా : ఆపు. మన తెలివికి సంతోషించాం. (రాజా వెళతాడు)

చం : నీ తెలివికన్నానా? కుటుంబంయొక్క మానాభిమానా లను మంటగలపి... మాతృదేశానికికూడ అపకీర్తి తెచ్చే నీకన్నానా... నాన్నా... మానవు డెప్పుడూ మానవుడి లాగే బ్రతకాలి... ద్రోహి ఎప్పుడూ ద్రోహిగానే ఉంటాడు... పాముకు పాలుపోస్తే ఏమవుతుంది... అంతే. ఆలోచించుకో.

జా : అబ్బబ్బ...యికూరుకోరా బాబు...ఏదో అన్నాను. అనగానే అయిపోయిందా? ఆ వెధవలు చుట్టాలయినా ఆప్తులయినా మన కేం...జెయిల్లోనే చావనీయి.

చం : నాన్నా ... అభ్యుదయ శక్తుల కెప్పుడూ అపజయం ఉండదు.

జా : సరే నేనే ఓడిపోయానులే... స్నానంచేసి...భోజనానికి లేద్దాం పద... (యిద్దరూ వెళతారు. రెండో కర్టెన్ లాగ బడుతుంది.)

[ యీ స్టేజిని రెండు భాగాలుగా చేయాలి ... ఒక భాగంలో సూరయ్య పడుకొని ఉంటాడు. రెండో భాగంలో సరోజ కూర్చొని ఉత్తరం వ్రాస్తూ ఉంటుంది. ]

సూ : సరూ...అబ్బ...సరోజా...ఎక్కడ నీవు?

స : (కన్నీరు కారుస్తూ) వస్తున్నానండి. (వ్రాసిన ఉత్తరం మడచి కవరులో పెట్టి బయటకువెళ్ళి తిరిగి వస్తుంది.)

సూ : వస్తున్నావు. నీవు వస్తూనే ఉండు. నేను చస్తూఉన్నాను.

స : (ప్రవేశించి) ఏమిటండి...ఆ మాటలు.

సూ : (సరోజవంక చూసి) సరోజా...? ఏం ? కన్నీరు కారుస్తావు.

స : (తుడుచుకుంటూ) ఆఁ! ఆఁ! లేదండి.

సూ : సరోజా... అబ్బ... బాధ.

స : (మందుసీసాలోని మందుయిస్తూ) యిదుగో త్రాగండి... మందు.

సూ : (దగ్గుతూ) సరోజా... యిక జీవించేమార్గం కనబడటం లేదు. అబ్బ... బాధ...

స : మీరు... విశ్రాంతి తీసుకోండి... కొంచెంసేపు.

సూ : సరోజా... చిన్న వయసయినా...నీవెంత మంచిదానవు. నీవిక్కడెందుకు... వెళ్ళు.

స : పరవాలేదు... విశ్రాంతి తీసుకోండి.

సూ : (క్రమంగా నిద్రిస్తాడు)

స : (తనలో) కష్టసుఖములు కావడికుండ లన్నారు. ఎప్పుడు నాకింకా సుఖాలు... యీ జీవచ్ఛంలా బ్రతికేకన్నా మరణిస్తే బాగుండదూ ?

(ఇంతలో తెరలో ఆనాటి బైరాగి మాటలు)

"జీవితం జీవించడానికే... జీవితమాధుర్యం జీవిత సమస్యల నెదుర్కొనడంలో ఉంది. చింతలకు కష్టాలకు వెరచి పిరికిపందవలె పారిపోవడంలో జీవితమాధుర్యం లేదు"

తాతా... నిజంగా నీవన్నమాటలు వేదవాక్కులు... జీవితంలో ఎవరి బ్రతుకూ స్వంతంగాదు. ముఖ్యంగా ఆడదానికి అడుగడుక్కు అవరోధాలు కల్పించింది సంఘం ... (అంటూ కన్నీరు కారుస్తూ పాట)

ప్రేమ నిరాశైపోయినది...మా
ప్రేమ నిరాశైపోయినది. ఓ... ... ॥ప్రే॥
ఆశలే మటుమాయమై నే
లేశమయిన లేక ... వియోగ
బాధ విషాదగాథ ... ఏనాటి
కింతేనా ... బ్రతుకంత
యింతేనా ... ... ॥ప్రే॥
విధిలేక చేసిన పాపానికే
ఫలితము మాకేనా ... దయలేద
సంఘానికి ... ఎన్నాళ్ళు యీ వ్రాత
మా కెన్నాళ్ళు యీ వ్రాత ॥ప్రే॥

యింతేనా నా బ్రతుకు.

[అంటూండగా రాజా ప్రవేశం...కన్నీరు తుడుచుకుంటూ సిగ్గుతో ప్రక్కగదిలోకి వెళ్ళిపోతుంది. సూరయ్య గాఢ నిద్రలో ఉంటాడు. అది చూసి రాజా సరోజ ఉన్నగదిలోకి వస్తాడు. సరోజ చాల సిగ్గుపడు తుంది.]

రాజా : సరోజా...(దగ్గరగావచ్చి) ఎందుకలా సిగ్గుపడతావు.
స : నా కేదో భయంగా ఉందండి.
రా : ఎందుకు ? డాక్టరు ఏమన్నా డేమిటి...?
స : మందిచ్చి పోయారు...విశ్రాంతి కావాలన్నారు.

రా : సరే యింకేం...అలా నిద్రపోనీయి.

స : (తటపటాయిస్తూ) నన్ను ...పోనీండి.

రా : ఎక్కడికి...యిప్పు డెక్కడి కెళ్తావ్ సరోజా...చూడు ఆ కారుమబ్బు...ఆ మబ్బు చలనానికి ఆ తారలు ఎలా చలించి పోతున్నయ్యో చూడు. వాటి కెందుకో అంత భయం.

స : ఆ కారుమబ్బు తారల ప్రకాశానికి ఆటంకం కలిగిస్తున్నది కాబోలు !

రా : సరోజా...ఆ నల్లనిమబ్బే...చల్లని ఉదకాలను కురిపించి భూతలాన్ని సస్యశ్యామలం ఫలభరితం చేస్తుంది.

స : కావచ్చు...నన్ను పోనిస్తారా.

రా : సరోజా...అదుగో...ఆ ప్రేమలత... ప్రకృతి స్వేచ్ఛా వాయువులను పీల్చి ఎలా పెరుగుతున్నదో చూడు.

స : నాకు భయంగా ఉందండి...

రా : భయం దేనికి అభయ మిస్తాను...? నిన్ను శాశ్వతంగా ఎంతో సంతోషంగా...ప్రేమానుబంధంలో...

[అంటూ ఉండగా సరోజ సూరయ్య గదిలోకి పరుగెత్తుతుంది. రాజా ఆమె ననుసరిస్తాడు. సూరయ్య మేల్కొంటాడు.

సూ : ఏమిట్రా...అది...రాజారాం.

రా : (సంభాషణ ధోరణిమార్చి) ఏమిటా? వాడు మాత్రం వాడు ... వాడి బ్రతుకెంత వాడెంత ... నన్నెదిరించి... నన్ను నీచంగా మాట్లాడుతాడా? వాణ్ణి అంతు తేల్చు కోందే నాకు నిద్ర పట్టదు.

సూ : ఎవడ్రా వాడు.

రా: ఎవడా...? ఆ జానకిరామయ్య కొడుకు...చంద్ర్.

స: వారేం చేశారు...మిమ్మల్ని.

రా: వారు...అబ్బ ఎంత మర్యాదగా పిలుస్తున్నావ్.

సూ: పోనీరా ... పసివాడు ... అబ్బ ... బాధ...అయినా వాడు నిన్నేమీ అనేవాడు కాదే.

రా: వాడా ... నేనూ మొదట్లు ఇలాగే అనుకున్నా... అందుకే యింతవరకూ తెచ్చాడు.

సూ: అబ్బబ్బ ... యిక నూకుకోరా బాబు ... (దగ్గుతూ) సరోజా ... యిక జీవించే ఆశ లేదు...గుండెదడగా ఉంది.

స: (కన్నీరు కారుస్తుంది.)

రా: (ఓదార్చుతూ) సరోజా ... కన్నీరు కారుస్తా వెందుకమ్మా... నేనున్నానుగా... భయమెందుకు?

స: (సూరయ్యముఖం చూపుతూ) వారిముఖం...నాకుచాలా భయంగా ఉందండి. చూడండి ... వారికళ్ళు తేలి పోతున్నయి... నాకళ్ళు చెమ్మగిల్లుతున్నయి.

రా: నో... నో... అలా ఫీల్ కాకూడదు.

సూ: (బాధతో) సరోజా... చూడు... యిదుగో మనం యిప్పుడున్న యీా మహాసౌధమే... నీ జీవితసౌధం... అబ్బ నొప్పిగా ఉంది ... సరోజా ... యిటురా ... దగ్గరకు రా... తల్లి... వయస్సు చిన్నదయినా ఎంత బుద్ధిమంతు రాలవు... (విచారిస్తూ) నీ జీవితాన్ని నేను నాశనం చేశాను... ఆ పాపం నే ననుభవిస్తున్నాను... అదుగో ఆ కనబడే పెట్టె... దానికి తగిలించిఉన్న తాళాలు... నీజీవిత మార్గదర్శకులు... సరోజా... యిక... నా దేహం

చాలించబోతూఉంది... అదుగో... ఎవరో నన్ను రమ్మని పిలుస్తున్నారు... (అని అంటూండగా నేపథ్యంలో)

"భూమాత నిను పిలుచుచున్నదోయి
రావోయి యిక నీ తనువు చాలించి"

[అని విచిత్రంగా పాట, చిత్రమయిన ధ్వనులు. మబ్బు మెరుపులు, గాఢాంధకారం.]

సూ : అదుగో పిలుపు...సరోజా...నేను వెళ్తున్నా...శాశ్వతంగా వెళ్తున్నా...(సూరయ్య కన్ను మూస్తాడు ... సరోజ కెవ్వున కేక వేసి ముఖాన బొట్టు తుడుచుకుంటుంది. రాజా అదోరకంగా చూస్తాడు)

స : (ఏడుస్తూ) ఏమండి...మాట్లాడరు ... జీవిత సుఖాలన్ని త్యజించి ... ప్రేమానుబంధాన్ని తెగత్రెంపులు చేసుకొన్నా ... నా నొసట కుంకుమ వ్రాత తీసివేశారా ... యీ ఘోరవార్తవింటే మా నాన్న యింకా బ్రతుకుతాడా ... అబ్బ ... నా హృదయంలో ప్రళయసముద్ర ఘోషలు వినిపిస్తున్నయి.

(అంటూండగా తెర)

# ౫వ దృశ్యము

[ స్థలం. బసవయ్యగారిల్లు. బసవయ్య మంచంమీద కూర్చొని చుట్ట చుట్టుకుంటూ ఉంటాడు. ఇంతలో పోస్టువాడు ఒక కవరు తెచ్చియిస్తాడు. అది సరోజ వ్రాసిన ఉత్తరం. దాన్ని విప్పి చూసుకుంటాడు. యీ ఉత్తరాన్ని నేపథ్యంలో సరోజచేత చదివిస్తే దృశ్యానికి రమణీయత ఏర్పడుతుంది. ]

నాన్నా...

యిది ఎవరో వ్రాసిన ఉత్తరం అనుకోబోకు. ఒక మరువరాని సంఘటన జరిగిపోయిన తరువాత ... తిరిగి కంగారుపడి...చింతిస్తే ఫలితం...ఏముంటుంది?

నాన్నా...

నా జీవితంలో యీ విధంగా ఉత్తరం వ్రాయడం యిది మొదటి...ఆఖరుసారి అనుకుంటూ ..ఒకనాడు...అసంభవమనుకున్న సంఘటనలన్నీ జరిగిపోయిన తరువాత...ఆపుకోలేని ఆవేదనతో నీకీ ఉత్తరం వ్రాస్తున్నాను.

అందరి స్త్రీలలాగే నేనూ...యీ ప్రపంచానికి...ఒక క్లిష్టసమస్యను...ఆడది పుడితే , తల్లిదండ్రుల నవనాడులు క్రుంగే...కళ్ళు చీకట్లు కమ్మే ... యీలోకంలో నేను పుట్టానని నీకు తెలుసు.

ఆడవాళ్ళు జ్ఞానం లేని వారని మీరంతా చాల యీసడింపుగా చూస్తారు. అవును. జ్ఞానం ఉంటే యీ అజ్ఞానంలో ఎందుకు పడి మునిగిపోతారు.

నాన్నా...నా బ్రతుకెందుకిలా అయిపోయిందో నీకు తెలుసా ? నా అందం ... నా చదువు ... నా వ్యక్తిత్వం

యివన్నీ యీనాడు ఏమయిపోయినయి...? నా యీ భగ్న జీవితానికి బాధ్యులెవ్వరు...? నీకు నీవే నంటుంది కాబోలు సంఘం...ఎవరి జీవిత సమస్యల కెవరు బాధ్యులని ... ఆ బాధ్యత ఎవరికి వారే అని మీసిద్ధాంతం ... అది శుద్ధ పొరపాటని మా సిద్ధాంతం.

ఒకనాడు... నా సౌందర్యాన్ని కళ్ళారా చూసి మురిసి పోయినదాన్ని, యీనాడు నా ముఖాన్ని చూసి అసహ్యించు కుంటున్నాను...నా కులమర్యాద ..మన పెద్దలు ... నీవు ...కలసి...నాకీనాడు చేసిన మేలు యిదేనా ?

నాలో పేలతనం వచ్చేసింది. నా చెక్కిళ్ళు కన్నీటిచారి కలతో మాసి మలిన మవుతున్నయి. నా పెదవులు చీటికి మాటికి కంపిస్తున్నాయి.

చదువుకుంటే మంచిదని చదువు చెప్పించావు. తల్లిలేని పిల్లని ... తల్లి దండ్రి నీవే అని పెంచావు ... చదువు మానకముందే... అమ్మ .. యీడొచ్చిన పిల్లనని ... కళ్ళారా పెళ్ళిచూసి సంతోషించుదామని సంబంధాల కోసం వెదకింది. పెళ్ళికొడుకుల ధరలు విపరీతంగా పెరిగి పోయినయి. జేరం కుదరలేదు. ఆ తరువాత అమ్మ ... యీ పెళ్ళి సమస్యను.. నా యీ జీవిత దారుణ సమస్యను ...తీర్చకుండా వెళ్ళిపోయింది.

అవును. ఆడజన్మ నేనెందుకెత్తాలి. సంస్కారం సభ్యత... నాలోవున్నా అమాయకంగా కనబడ్డాను. కాలేజిలో చది వాను. చదువయిపోయింది ... యింటికి వచ్చాను. ఆఖరికి యీ దారుణ సమస్య...తీరే రోజులు దగ్గరకు దాపురించి

...నా పెళ్ళయింది . ఎవరితో...నా కాలేజి స్నేహితునితో కాదు. అరవై ఏళ్ళవృద్ధునితో ... పెళ్ళికుమారునికి ...చాల ఆస్తివుంది... కట్నం యివ్వక్ఖర్లేదు. విద్యా...? శూన్యం .. తెలివితేటలా? పూజ్యం ... సౌందర్యమా? నాస్తి... యిక మిగిలిందేమిటి...డబ్బు డబ్బు?

నాన్నా...యీ వివాహానికి నేను యిష్టపడి చేసుకున్నాననుకున్నావా? అవును . బహుశః పెళ్ళికొడుకునుచూసి ఉంటే నీకూ యిష్టముండేది గాదు. శ్రీరాంపురం అనకపోతే మొదటే నేను అంగీకరించి ఉండేదాన్ని కాదు. పెళ్ళికొడుకు భూస్వామికొడుకన్నావు. అవును నేను నా చందర్ అని భ్రమపడ్డాను. కాని యీపెళ్ళికొడుకు భూస్వామి మాత్రమే. భూస్వామికొడుకుగాదు. నాన్నా... వంచింపబడి యిప్పుడు చింతిస్తే ఫలితం శూన్యంగదా యని సుడిగుండంలో మునిగేందుకు తయారుగాఉన్న ప్రాణిలా కళ్ళుమూసుకొని కర్తవ్యం విస్మరిస్తున్నాను.

ఎవరో చూచివచ్చారని చెప్పుడుమాటలు విని మోసపోయావు. నాన్నా ప్రపంచం మోసంతో కూడుకొన్నదని. తెలుసుకున్నావా?

. నేను పెళ్ళినాడే ఎదురుతిరిగితే నీ మనస్సులో ఏడ్చిపోతావని... నే నెంతో మర్యాదగా... నిజమయిన కన్నబిడ్డలా... కర్తవ్యాన్ని గమనించి ప్రవర్తించి... జీవితంలో ఎడతెగని దారుణ సమస్యలో కాలుపెట్టాను.

నేనూ చదువుకున్నదాన్నే. సభ్యత ... సంస్కారం ఉంది...అయితేనేం ... నా జీవితంలో ఒక జీవచ్ఛవాన్ని

నేను...యీ సమస్యల కన్నిటికి బాధ్యులెవరో ఒక్కసారి ఆలోచించుకో.

శలవ్...యిట్లు
మీ సరోజ.

బస : (ఉత్తరాన్ని అదేపనిగా చూస్తూ) నేను...పాపిని...నేను నా కన్న తల్లికే ఘోరాపచారాన్ని చేశాను. యీ పాపిష్టి కళ్ళు యిక నా చిట్టితల్లిని చూడలేవు...యీ పాడుచేతులు నా తల్లిని ... నాశనం చేశాయి... (అంటూ ఒక కాగితం మీద ఉత్తరం వ్రాసి...అటూ యిటూ తిరిగి గోడకు తల కొట్టుకుంటాడు) అబ్బా...యీ మాత్రానికే నాకు మరణం రాదు...(అని పెట్టెలోని మందుతీసి త్రాగి అదేవిధంగా కూర్చున్నపాటే నీలుక్కు పోతాడు ... క్షణం సేపు నిశ్శబ్దం...ఇంతలో బైరాగి ప్రవేశం.)

బై : (కలవరపడుతూ...అటూ యిటూ తిరిగి...మంచంకోడు క్రింద కాగితం తీసి చూస్తాడు. అందులో యీ విధంగా ఉంటుంది.)

కూతురు సరోజకు మీ నాన్న వ్రాయు...ఆఖరుఉత్తరం.

సరోజా!

నీ ఆవేదనను గ్రహించాను. తల్లీ ... అందరు మానవు ల్లాగే నేనూ ఒకమానవుడనే ... నేనూ ఒకతండ్రినే ... అపార్థంచేసుకొని నేను చేసిన ఘోరానికి వివాహంనాడే నా హృదయం ఛేదించింది. పెళ్ళిమానేద్దునా కుటుంబానికగౌర వం...మానేయక పోతే కుమార్తెకగౌరవం...యీ రెండు దారుణ సమస్యలలో అడ్డకత్తెరలో పోకలా నలిగిపోయాను

...అక్కడ నరకకూపంలో నీ బ్రతుకును గురించి ... యిక్కడ సాటి వారల పోటులగురించి బాధపడేకన్నా ... ఒక్కసారి ఆత్మహత్య చేసుకొని ప్రాణం విడిస్తే ఎంతో హాయిగా వుంటుందని ... సాహసించి యీ కార్యానికి పూనుకుంటున్నాను. యీ జన్మలో ఋణానుబంధం యింతటితో తీరిపోయింది .. మరుజన్మలో మళ్ళీ కలుసుకుంటాం లే తల్లీ.

ఆడవాళ్ళు అజ్ఞానులని భావించి యీ విధంగా అపచారం చేసే తండ్రికి యిలాంటి శిక్ష లేకపోతే సంఘానికి గౌరవ మేముంటుంది?

ఏ తండ్రికూడ యీవిధమయిన పనిచేయకని నా ఆశ.

ఇట్లు
మీ తండ్రి

[బైరాగి నిశ్చేష్టుడయి క్షణంఆగి శవాన్ని చేతుల్లోకి తీసుకొంటాడు. ఆతడు వెళ్తూ ఉండగా తెర మెల్లగా జారుతుంది.]

# 6 వ దృశ్యము

[స్థలం. సూరయ్యగారిల్లు, సరోజ దిగులుగా కూర్చొనిఉంటుంది. గోడకు గాంధి, జవ్హారు, విశ్వకవి రవీంద్రుని ఫొటోలుంటాయి. ఒక ప్రక్కగా వీరేశలింగంగారి ఫొటో ఉంటుంది. సరోజ వీరేశలింగం ఫొటో వంక చూస్తూ పాట]

(తెరవెనుక)

చం : బ్రతుకులేదూ, భయములేదూ, బాటయేలేదూ
ఏదిఉన్నా ఏమిఅయినా నీవు నేనేనే.
మిగిలింది యింతేనే.

స : బ్రతుకులేద ? భయములేద ? బాటయే లేద ?
ఏదిఉన్నా ఏమిఅయినా నీవు నేనేనా ?
మిగిలింది యింతేనా ?

చం : గడచిపోయిన రోజుకన్నా మధురమేలేదూ
ఎడతెగని యీ బాధకన్నా బాధయేలేదూ ॥బ్ర॥

స : మరచిపోయిన మాటలన్ని మమతలయినాయేమో
మమతలన్ని మరువలేనూ మనసూ వేరయినా
మిగిలింది యింతేనా ?

చం : బ్రతుకులేదు, భయములేదు, బాటయేలేదూ
ఏదిఉన్నా ఏమిఅయినా నీవు నేనేనే.
మిగిలింది యింతేనే.

స : బ్రతుకులేద ? భయమేలేద ? బాటయేలేద ?
ఏదిఉన్నా ఏమిఅయినా నీవు నేనేనా ?
మిగిలింది యింతేనా ?

స : (వీరేశలింగం ఫొటోవంక చూస్తూ) ఓ దేశనాయకులారా! సంఘంలో స్త్రీని యిలా బానిసగా చెయ్యడం... మీ

ఆశయానికి విరుద్ధం గాదా? అవును ఎవరి జీవిత సమస్యల కెవరు బాధ్యులు... ?

(యింతలో రాజా ప్రవేశిస్తాడు)

రా : (వికటంగా) అహ్హాహ్హా...ఎవరి జీవిత సమస్యల కెవరు బాధ్యులు .. నీ జీవిత సమస్యకు నీవే బాధ్యురాలవు. సరోజా... తెలిసిందా ? నీ జీవిత సమస్యకు బాధ్యులెవరో?

స : అవును. తెలిసింది. నా జీవిత సమస్యకు యింతకు పూర్వం బాధ్యు లెవరో నాకు తెలుసు ... యికమాత్రం నా జీవిత సమస్యకు నేనే బాధ్యురాలను.

రా : అహ్హాహ్హా...యింతకు పూర్వం...బాధ్యు లెవరో తెలుసు కొన్నావా ?

స : ఆఁ! తెలుసుకున్నాను.

రా : ఆ బాధ్యత గలిగిన వ్యక్తి ఎవరో చెప్పటానికి సాహసం ఉందా ?

స : సాహసం ఎందుకు లేదు. హిందూ స్త్రీ సాహస గాథలు నీ వెప్పుడూ వినలేదూ ?

రా : హిందూ స్త్రీ ... పిచ్చిదానా ... పాతపద్ధతులు ... పురాతనాచారాలు.. యింకా మానలేదు. సాహసివయితే వా డెవడో చెప్పూ.

స : వా డెవడో నీబోటి మోసగాడయి ఉంటాడు.

రా : అహ్హాహ్హా...నేనా మోసగాణ్ణి...భలే అన్నావు సరోజా.

స : భలే అన్నావుగాని బయటికి దయచెయ్యి.

రా : దయచేస్తాను. నీకో శుభవార్త చెప్పి దయచేస్తాను.

స : నాకు తెలుసులే ఆ శుభవార్త.

రా : ఊఁ! నీకు తెలుసా...మీ నాన్న చచ్చింది నీకు తెలు సన్నమాట... మరి ఏడవటం లేదేం...?

స : (ఆశ్చర్యంగా) ఏమిటి ... మా నాన్న చని పోయాడా ... నిజంగానా...?

రా : ఆఁ! నిజంగానే ... యింకెక్కడకు పోతావు ... నా సరోజా.

స : (బ్రతిమాలుతూ) రాజ్...నిజం చెప్పవూ...మానాన్నే నా? నీ కెవరు చెప్పారు.

రా : అహ్హాహ్హా...అలా దారికిరా ... వాడెవడో... సన్యాసిలా గున్నాడు...వాడు చెప్పాడు.

స : రాజ్...ఆ సన్యాసి ఎక్కడున్నాడు?

రా : ఎక్కడున్నాడో చెప్తే నాకోరిక ఫలిస్తుందా...?

స : (బ్రతిమాలుతూ) రాజ్ ... చెప్పవూ ... నన్నీ పరీక్ష సమయంలో అలా కంగారు పరచడం...నీకు న్యాయమేనా? నీకు పుణ్యముంటుంది...చెప్పవూ ?

రా : హుఁ! పుణ్యం ... పాడుబ్రతుకును మరచిపోయేందుకు? నీడజీవాలకోసం కల్పించినదే పుణ్యం.

స : (ప్రాధేయ పడుతూ) ఏమండీ ... నన్నిక పరీక్ష చేయ బోకండి...ఆ సన్యాసి ఎక్క డున్నాడో చెప్పండి.

రా : అహ్హాహ్హా...యిష్టంకానిది...అనిష్టం అన్నారు ... యిష్ట మయింది యిచ్ఛ అన్నారు. నా మనసుకు నీవంటే ఎంతో యిష్టం.. సరోజా ... విలువయిన వలపును వదలి పెట్టడం న్యాయ మంటావా ?

స : రాజ్...అనవసరంగా నా హృదయాన్ని బాధించి పాపం గట్టుకోబోకండి ... అసహాయ అయిన ఒక స్త్రీని యిలా అవమానించడం మగవారి ధర్మంకాదు.

రా : అహ్హాహ్హా...రసం చెడిన వాడికి రసగుల్లా ఒకటే—పనస కాయా ఒకటే...నీవు చింతిస్తున్నావని నేను చింతపడేదా. (దెప్పిపొడుస్తూ) అయినా హృదయం లేనివాడికి రోదలు వినబడతాయా ?

స : అవును...మానవుడికి కొమ్ములు...తోక మొలుస్తాయా? స్వబుద్ధి అనే లోపమే మానవత్వం లేదంటారు...రాజ్... నీకు తోటిమానవుణ్ణి గౌరవించే విధానం తెలియదా ?

రా : తోటిమానవుణ్ణి గౌరవించినంత మాత్రాన లోకం గౌర విస్తుందా ?

స : లోకం నిన్ను గుర్తించడం లేదనడంకన్నా, నీవు లోకాన్ని ఎంతవరకు గుర్తించావో పరిశీలించుకోవాలి.

రా : శ్రీరంగ నీతులు మాని ... కర్తవ్యాన్ని కాలదన్నక కరుణించు.

స : కర్తవ్యం...నీ కర్తవ్యం నీవు తెలుసుకున్నావా? నీవు ఎదుటి వారిని ప్రేమిస్తున్నంతవరకే నిన్ను వారు ప్రేమిస్తుంటారు.

రా : అయితే నీవు నన్ను ప్రేమించడంలేదా ?

స : రాజ్...మానవుడికున్న మమకారం...తన్ను ప్రేమించే వారిపైగాదు...తాను ప్రేమిస్తున్న వారిపైన.

రా : యింతకూ...ఏమంటున్నావో చెప్పు.

స : ఏమంటాను. కాదంటాను. (అని వెళ్ళబోతుంది)

రా : (ఎదురడ్డువచ్చి) ఏయ్ ... ఆగు... నీ బొందిలో ప్రాణం ఉన్నంతవరకు రాజాని ధిక్కరించిపోతావా ?

స : దిక్కరించింది ఎవరు ? తిన్నయింటి వాసాలు లెక్కబెట్టింది ఎవరు ? స్వామిద్రోహం చేయదలచుకొన్న దెవరు ? ఎవరు ధిక్కరించి వెళ్ళుతున్నది ?

రా : (కోపంగా) అస్తవ్యస్తపు మాటలుమాని ప్రస్తావనలోకిదిగు.

స : అవును ... నీప్రస్తావనే నీకు మహాప్రస్థానం... రాజ్... బాటసారిలా వచ్చావు... వేటకొని వలపన్నావు... ఆ వేటను ఆటగా ఉపయోగించుకుంటున్నావు ... మాటలతో పనేందుకు ? ఆటలుమాని బాటసారిలా దయచెయ్యి... (అని అడుగు ముందుకు వేస్తుంది)

రా : (అడ్డువచ్చి) ఆగు.

స : (పిచ్చిదానిలా) ఆగను... పోతాను... పోతాను నాభర్త... మానాన్న పోగా... నేను పోలేనా... పోతాను.

రా : పోతావ్ ...పోతావేం...ఎక్కడికి (సమీపిస్తాడు)

స : (ఏహ్యంగా) ఛీ ! నీచుడా ! పొట్టకోసినా కరుణ అనేది లేని కటికవాడవు ... మానాభిమానాలున్న స్త్రీముందు నీ ప్రగల్భాలుమాని బ్రతుకుపై ఆశలుంచుకొని బ్రతుకు.

రా : చింతచచ్చినా పులుపు చావలేదా ... (సమీపిస్తాడు) నిన్ను నా అందాలరాణిని చేస్తా ?

స : (కెవ్వున కేక వేస్తుంది)

రా : అట్లా అరుస్తావేం సరోజా ?

[ఇంతలో వైరాగి ప్రవేశం]

రా : (బైరాగిని చూచి) ఏరా ? వెధవాయి ... రాకపోకలకు సమయాసమయాలు లేవ్రటా.

స : (బైరాగిని పట్టుకొని) తాతా ! నాన్న చనిపోయాడా ? నిజంగానా ?

రా : నేను చెప్పలేదూ ? నిజమేనని.

స : (వెక్కి-వెక్కి- ఏడుస్తూ) యిక్కడ యీ విధంగా జరిగింది... అక్కడ ఆ విధంగా జరిగింది...

బై : ఆ అసమర్థుని జీవయాత్ర ముగిసింది...చిట్టితల్లి...జాతస్య మరణం ధ్రువం అన్నారు. పుట్టినవాడు గిట్టక తప్పదు... మత్యువు లేనిదే ఆత్మవికాస ముండదు. కాని యీ ఆత్మహత్య ?

రా : ఎవ్రడా...పానకంలో పుడకలా తయారయ్యావ్?

బై : అవును నాయనా ... బాధితులను చూచి దుర్బలులు కన్నీరు విడుస్తారు. ధీరులు సాయపడుతారు. మూర్ఖులు విరగబడి నవ్వుతారు. కష్టసుఖాలు తెలుసుకొని సంఘంలో నీతిగా సంచరించాలి...

రా : చేజిక్కిన అవకాశాన్ని జారవిడుచుకో మంటావా ?

బై : నాయనా ! జీవితంలో అవకాశాలు కలగడం ఒకఎత్తు. వాటిని సద్వినియోగం చేసుకోవడం మరో ఎత్తు. చీలిక దారులు కన్పిస్తున్నప్పుడే ... మనసు ప్రలోభ పడుతున్నప్పుడే...ఆత్మజ్ఞానం కావాలి. ఆత్మనిగ్రహాన్ని అలవరచుకోవాలి. ఆ ఆత్మజ్ఞానం... శిక్షణవల్ల వస్తుంది. లేక పరిస్థితుల ప్రభావంవల్ల వస్తుంది. అదీగాకపోతే సంప్రదాయం

వల్ల వస్తుంది. ఆ ఆత్మజ్ఞానం ఉన్నవాళ్లు పర్వతశిఖరాలు అందుకుంటారు. లేనివాళ్ళు పాతాళానికి క్రుంగిపోతారు.

రా : ఏడిశావ్‌గాని వేదాంతం కట్టిపెట్టి వచ్చినదారినే దయచేయి.

బై : నాయనా? నీకు అప్పచెల్లెళ్ళు లేరూ ... అవును లేరు కాబోలు...నీవు గౌరవించి నీవు గౌరవింపబడు నాయనా? పాపం బాధ్యత తెలియదు.

రా : నాకు అప్పచెల్లెళ్ళు లేరు! అన్నదమ్ములు లేరు. మా అన్న నీలాగే సన్యాసం పుచ్చుకున్నాడనుకుంటా...నాకు తెలియదు.

బై : నాయనా! నా మాటవిని వెళ్ళు ... కర్తవ్యాన్ని మరచి ...వ్యక్తులపై ద్వేషం పెంచుకోబోకు...వెళ్ళు.

రా : (సరోజవంక చూచి) సరోజా...కష్టాల్లో ఉన్నావని వది లేస్తున్నాను. అదంతా ఆలోచించుకొని...వాలులోకి రా! (వెళతాడు.)

బై : (రాజ్ వెళ్ళిన తరువాత) పిచ్చివాడా? నీవు ఎదుటివారిని ప్రేమిస్తున్నంతవరకే నిన్ను ఎదుటివారు ప్రేమిస్తారు. ఏక సూత్రంపై నడవాలనుకుంటే ఆ ఏకసూత్రం...నేను తయారు చేసినదే కావాలనడం ఎంతమాత్రం పనికిరాదు. (సరోజ వైపు తిరిగి) సరోజా...గతం నాస్తి...రేపటిసంగతి ఆలో చించుకొని గుండెనిబ్బరం గలిగి ఉండమ్మా ... చింతించకు యితని పేరే మన్నాడు?

స : రాజారాం...

బై : రాజారాం...రాజారాం...సరే...నేనలా బజారుకెళ్ళి వస్తాను...ఉండమ్మా... (తనలో) జీవితంలో ఒక్క తప్పటడుగు చాలు చెడిపోటానికి.

స : ఏం తాతా...యిక్కడే ఉండిపోరాదూ?

బై : మళ్ళీ వస్తానమ్మా. (వెళతాడు)

స : జీవితంలో అవకాశం కలగడంకష్టం...అవకాశాన్ని జారవిడుచుకోరాదు...రేపటిసంగతి ఆలోచించుకొని...గుండె నిబ్బరంతో ఉండమ్మా... గతం నాస్తి...అబ్బ ... నిజంగా తాత ఎంత రాటుతేలిన మనిషి...జీవితంలో అన్నీ చవిచూశాడు ... (అని కుర్చీలో కూర్చుంటుంది.)

[ వెనకగా ఏదో చప్పుడు వినబడుతుంది. సరోజ గమనించదు... చందర్ ప్రవేశిస్తాడు. ఏదో మాట్లాడాలని ఉబలాటం. కాని అవకాశాన్ని కల్పించుకోలేక పోతాడు. అలాగే నిలబడిపోతాడు. క్షణం నిశ్శబ్దం. సరోజ వెనుతిరిగి చూస్తుంది. కుర్చీలోనుంచి లేచి నిలబడి...కొంచెందూరం నడచి తలమీద చీరచెంగు వేసుకుంటుంది. యిద్దరు అలాగే నిలబడిపోతారు. ఏం మాట్లాడాలో ఎవరికి తెలియదు వారిద్దరు చిన్ననాటిపాట. జ్ఞాపకం చేసుకుంటారు. నే పథ్యంలో. ]

చం : చూడుమదే కోకిలమ్మ కూతలేమిటో
కూతలోన దాగియున్న భావమేమిటో.

స : చేతనయినంతవరకు చేయుమన్నది
ఊత కావాలంటే నన్ను అడగమన్నది.

(చందర్ మాట్లాడాలను కుంటాడు. ఎదురుగావచ్చి నిలబడతాడు. సరోజ గట్టిగా ఏడ్చి కౌగలించుకుంటుంది.)

చం : సరోజా...

స : చందర్ ... (దూరంగా తప్పుకుంటుంది)

చం : చింతించకు సరోజా ? హుఁ ! గుడ్డిప్రపంచం. సంఘంలో హక్కును గురించి పోరాడటానికికూడా మానవుడికి భయమే. సరోజా ! నాకు తెలుసు. నీవు నీజీవితంలో స్థిరమయిన గమ్యాన్ని చేరుకోవాలని... ఆదర్శవంతమయిన... మంచి ఉదారబుద్ధిగల సమాజంలో... స్వాతంత్ర్యంతో కూడుకున్న స్వేచ్ఛావిహారం సల్పుతూ నిష్కళంకమయిన ప్రేమలో మునిగి జీవిత మాధుర్యాన్ని చవిచూద్దామని... కలలు గన్నావు... విధాతవాంఛ వేరుగాఉంది... ఆ యినుప తెర తొలగిపోయింది... చింతించకు.

స : చందర్ ... జీవితం నిజంగా ఎన్నిసమస్యలతో కూడుకున్నది? నిజంగా నాహృదయం నీవే ననుకున్నా ...నాజీవితము నీవే ననుకున్నాను ... కాని నాకుమిగిలింది యీ ఒక్కకన్నీ రే.

చం : గతించినదానికి చింతిస్తే లాభం ఏముంది?

స : అవును. చింతిస్తే లాభం ఏముంటుంది ?

చం : మళ్ళీ రేపు కలుసుకుంటాను...

స : ఏఁ ! యింత తొందరగా ?

చం : మళ్ళీ రేపు కలుసుకుంటానన్నాగా... శెలవ్. (వెళ్తాడు)

స : (అలాగే చూస్తూ నిలబడిపోతుంది)

(తెర)

---

# 7 వ దృశ్యము

[స్థలం. సూర్యయ్యగారిల్లు. సరోజ ఒంటరిగా కూర్చొని వుంటుంది. రెండు కుర్చీలు. డ్రాయరు. డ్రాయరుపైన కొన్ని పుస్తకా లుంటయి. చందర్ కోసం నిరీక్షిస్తూ వుంటుంది. యింతలో చందర్ ప్రవేశం. సమయం షుమారు 4 గం. సాయంకాలం.]

స : (కుర్చీలోనుంచి లేచి...నిలబడుతుంది.)

చం : నమస్తే.

స : (ఏమీ మాట్లాడదు.)

చం : సరోజా...ఏం! సిగ్గుపడుతున్నావా? చూడు ... మనసులో అనేక కోరికలుంటయి...అవి తీరటానికి అవకాశం కావాలి.

స : చందర్.

చం : సరోజా...(కొద్దిసేపు నిశ్శబ్దం. యిద్దరి కళ్ళల్లో అనురాగ కిరణాలు ఎదురౌతయి)

స : చందర్...చూడు...అదుగో...చంద్రోదయ మయింది... ఆ చంద్రుడు ప్రకాశించకపోతే యీ భూతలమంతా అంధకార బంధురం కదూ!

చం : నిస్సందేహంగా...ఆ అనురాగమయిన కిరణజ్వాలలవల్ల కలిగిన వెలుతురు...భూతలంమీద తేజస్సును వెదజల్లి... వన్నెచిన్నెలు కూర్చి ... అంధకారాన్ని పటాపంచలు చేస్తుందిగదూ?

స : ఆ చంద్రుడిరాకకోసం కృష్ణపక్షంలో ఆ భూతలం ఎంత విచార పడుతుందో ... భూతలంయొక్క ఓర్పు ఎంత అచంచల మయినది.

చం: అవును. భూతలంయొక్క ఓర్పు అచంచలమయినదే కాదు. అగాధమయింది కూడా ... సరోజా.

స: ఆ అగాధంలో దిగితే...చంద్రుని తేజస్సు బహుశః క్షీణిం స్తుందేమో?

చం: క్షీణించదు. ఎప్పటికి క్షీణించదు. సరోజా...ఏది ఒక గీతంపాడు.

స: ఏం గీతం...ప్రేమగీతమా...ప్రియురాలిగీతమా?

చం: ప్రియురాలి ప్రేమగీతం పాడు.

స: ప్రియురాలి ప్రేమగీతం విని...ఆ గీతంలో నిండిన అవ్యక్త మాధుర్యం నీలో ప్రభవిస్తే మందానిలంలోని మావిచిగురులా చలించిపోవుగదా?

చం: తేనె ఊరేటట్లు నీ ప్రేమగీతం వినిపిస్తుంటే ... యీ భూతలాన్నంతా మరచి ఆకాశంలో ప్రయాణం చేస్తానేమో!

స: సరే...నేనేమని పాడనో చెప్పు.

చం: (ప్రకృతి వంక చూపిస్తూ) అవిగో ఆ కోకిలా ద్వయం ఏమో పాడుకుంటున్నయి. వాటి మాటలు విను.

స: నీవు పక్షులు...జంతువుల భాషల్లో ఏమి ప్యాసయ్యావు?

చం: నీవేమి ప్యాసయ్యావో...నేనూ అదే.

స: అలాగా...? సరే...విను...పాడనా?

(పాట) ఇదెనోయీ ఓ చెలికాడా
వలపులరాణిని కనుమోయీ
కంటిమి కలలే ఒకనాడూ...
ఉంటిమి మనమే మధురముగా...

యీనాడే యిక వెనుకటిగా...
ఉందామా మరి ఓ రాజా ॥ఇ॥
వీడకుమా నీ ప్రేయసిని,
పాడుదమా యీ ప్రణయములో
రావోయీ ఓ చెలికాడా...
వలపుల రాణిని కనుమోయీ... ॥ఇ॥

చందర్ ...నా జీవితాన్ని నీకర్పిస్తున్నాను. యిక పాల ముంచినా నీట ముంచినా...నీవే ... నిండు యవ్వనపు రెండు హృదయాలు చలించేటట్లు చేయబోకు సుమా.

చం : సరోజా...చిగురించే నిండు యవ్వన హృదయాలను వెలుగులోకి తీసుకొస్తాను అవసరమయితే మా యిల్లు వీడయినాసరే... యిక్కడే ఉండిపోతాను.

స : ఆమాత్రం మాట చాలు. మన ప్రేమానురాగాలు శాశ్వతంగా బంధింప బడితే....

చం : సరోజా... చూడు... యీ సౌభాగ్యవంతమయిన రోజు... యీ ప్రశాంత వాతావరణం... మళ్ళీ ఎప్పుడు?

స : ఏం? యింత తొందరగా?

చం : టయిం అయింది... భోజనంగూడ కాలేదు.

స : ఫరవాలేదు. మా యింట్లో భోంచేయకూడదా?

చం : ఆఁ! యింత స్వేచ్ఛగానా?

స : ఏఁ! సిగ్గుపడి భయపడుతున్నారా?

చం : కాదు. ఎదుర్కొని ఏడ్పిస్తున్నాను.

స : పాపం... ఆ హృదయం ఎలా తపించిపోతుందో.

చం : తపించడమేగాదు... చలించి... కృశించడానికి తయారుగా ఉంది.

స : పెద్దవాళ్ళ నలా బాధపెట్టవచ్చా... తప్పుకదూ.

చం : నాన్నగారికి ఎదురుతిరగడం తప్పే. కాని నా స్వేచ్ఛకు భంగం కలిగించడం ఆయన తప్పుకదూ.

స : పాపం అమాయకులు... వాళ్ళకేం తెలుసు... దూరాలోచన ఉండదు.

చం : సరోజా...మరచాను ... "సర్వోదయం" అనే నాటికను నేను వ్రాశాను...దాన్ని రేపే మా నాట్యమండలి ప్రదర్శించబోతూ ఉంది.

స : సరే...మంచిదే.

చం : సరే...ఇక శలవ్ ... (వెళ్తాడు)

స : (తల ఊపుతుంది. చందర్ వెళ్ళిన తరువాత) వెన్నతో సమానమయిన హృదయం ... చందర్ ... ఎంత చక్కని పేరు...చల్లని మనస్సు...నిష్కల్మష ప్రేమ ... (ఆదిలక్ష్మి పటంవంక చూస్తూ) అమ్మా ఆదిలక్ష్మి నన్ను పరీక్షించడం అయిందా ?

(అంటూండగా రాజా ప్రవేశం)

రాజా : అహ్హాహ్హా ... ఆదిలక్ష్మి ... పురాతనాచారాలు ... పాత్ర పద్ధతులు.

స : (ఆశ్చర్యంగా చూస్తూ ఉంటుంది)

రా : ఏం సరోజా...యివ్వాళ చాల సంతోషంగా ఉన్నావ్?

స : ఏం...రోజూ కంటె సంతోషంగా ఉన్నానా ?

రా : ఆఁ! మరికాదూ.

స : సరే...మీ కలా కన్పిస్తున్నాను కాబోలు. నాలో నవ్యత నాకే కన్పించడంలేదు...నన్ను పోషిస్తారా?

రా : ఏం కొంచెంసేపు మాట్లాడ కూడదా?

సం : నాతో మాట్లాడ్డానికేముంది?

రా : చూడు సరోజా ... నిన్ను యిన్నాళ్ళనుంచీ అర్థం చేసుకోలేకపోయాను...దానికి నేను చాలా పశ్చాత్తాప పడుతున్నాను. సరోజా...నేను నిన్ను ప్రేమిస్తున్నాను. నేను నిన్ను పూజిస్తున్నాను. నా ప్రేమ అచంచలమయినది. సాగరంకంటె కూడ అగాధమయినది...

స : ఆ అగాధం చాల అపాయమయినది...రాజ్...మనస్సు వేరుగా ఉన్నప్పుడు మమకారాన్ని వదులుకోవాలి. నీవు నన్ను ప్రేమించినా...నేను నిన్ను ప్రేమించ లేక పోతున్నాను!

రా : ఏం! ఎందుకని?

స : ఏమో !

రా : అయితే నన్నంగీకరించనన్న మాట.

స : నా ప్రాణం ఉన్నంతవరకు...అది నావల్ల కాని పని.

రా : (క్రోధంగా) సరోజా ... అహ్హాహ్హా నీవల్ల కాని పనా. చాలబాగ అన్నావు...అది నీనోటనుండి వచ్చిందేనా?

స : (బ్రతిమాలుతూ) రాజ్ ... యింకా యవ్వనంలో ఉన్న వాడవు. ఎంతో అభివృద్ధిలోకి రావలసినవాడవు. చిన్న పిల్లవానికి పాఠం చెప్పినట్లు చెప్తున్నాను. మీ ధోరణి మానుకోండి.

రా : (వికటంగా నవ్వుతూ) అహ్హాహ్హా ... ఆలోచించి సరైన ఆలోచనలోకి దిగకపోతే పడిన కష్టాలు గాక అష్టకష్టాలు

పడి అనేక నష్టాలకు గురికావాలి. మళ్ళీ మాకుమాటాడక నీ కర్తవ్యం విస్మరించుకో.

స : (నిర్లక్ష్యంగా) మిమ్మల్ని ప్రేమించడమే నా కర్తవ్య మయితే నేను ఆత్మహత్య చేసుకుంటాను.

రా : అహ్హాహ్హా...ఆత్మహత్య...నేనుండగానే నిన్ను ఆత్మహత్య చేసుకో నిస్తానా?

స : మీావాచాలత్వాన్ని కట్టిపెట్టి మునుపటి మాదిరి వచ్చిన దారినే వెళ్ళమంటున్నాను.

రా : వెళ్ళాలీ...నిన్ను నలుగురులో నగుబాటుపాలు చేస్తాను. నీ జీవితాన్ని సర్వనాశనం చేస్తాను.

స : యిక నీవల్లకాదని నేనంటున్నాను.

రా : వల్లకాదూ...అహ్హాహ్హా...నీజీవితం సర్వనాశనం....

స : నా జీవితం యిదివరకే సర్వనాశనమయి పోయింది. యింకా నీవేమి నాశనం చేస్తావు?

రా : రాజాఅంటే ఆకతాయికాదు. ఏమన్నావ్ ... కోప మెందుకే అందాలబాల.

స : రాజ్ ... నామాట వినవా ? నీ బ్రతుకుకోసం నిన్ను బ్రతిమాలుతున్నాను. నన్ననవసరంగా బాధపెట్టకు. అసహాయురాలైన అబలను అన్యాయంచేసి ఏమి అభివృద్ధి పొందుతావు ? రాజ్ ... నీవయస్సుకు ఎన్ని అభ్యుదయ భావాలుండవలసింది... అవి లేకపోగా యిలాంటి నీచపు పనులుచేసి ఎలా బాగుపడతావ్ ... రాజ్ ... యింకా పెరిగి ఎన్నాళ్ళో యీా మాతృభూమి మీాద బ్రతికి బాగుపడ వలసిన వాడివి... నామాట వినవూ ?

రా : (సమీపిస్తూ) చాలించు నీ ఉపన్యాసం.

స : (వెనుకకు జరుగుతూ) ఆగు... అడుగు ముందుకు వేస్తే చచ్చిపోతావ్... నీచుడా ?

రా : ఆఁ! ఏమన్నావ్... నీ చేతిలో చస్తే స్వర్గం... రా... రా... యీ దాసుడి ప్రేమకు భిక్ష పెట్టు.

స : (వెనుకకు నడుస్తూ) రాజ్... నీ కపజయం.

రా : (ముందుకు ఆవేశంగా సమీపిస్తూ) అహ్హాహ్హా...

స : ఛీ! నీచుడా... నీది ఒక బ్రతుకేనా ? ఎన్నిసార్లు చెప్పినా జ్ఞానంలేని పశువా ? పో... అవతలకు. (అని బల్లమీద ఉన్న రాతిబొమ్మను విసిరికొడుతుంది. ఏదో చప్పుడవుతుంది.)

రా : అబ్బా... గెలిచావు పో... నీ అంతు తేల్చుకోందే నిన్ను వదలనులే... (అంటూ వెళతాడు.)

స : వదిలింది తిక్క... నయాన ఎన్నిమాటలు చెప్పినా వినడు... ప్రేమట... ప్రేమ.

[యింతలో ప్రవేశం గంగులు]

గం : (మాటను అందుకుంటూ) ఆ ప్రేమేనండి ... అందరికీ తెగులయి పోయింది.

స : రా...గంగులూ...కూర్చో.

గం : ఏవండమ్మ గోరో ... యిప్పుడు చణం కూసోటానికి యీల్లేదు.

స : ఏమిటబ్బా అంత తీరికలేని పని.

గం : మా సిన్నబ్బాయిగోరు...ఏదో నాటకంరాసి ఏపిత్తన్నా డమ్మగోరు...దాంటో నాకూ్కడ ఒక యేసం ఉంది.

స : ఏమిట్రా ఆ వేషం?

గం : ఏమిటంటూ రామ్మగోరు ... ఒక ముసిలి జమీందారు ఉంటారంట ... ఆయన గోరికి ఏదో జబ్బంట ... ఆయన పడుకొనుంటే...యినకట్రపెట్టి యినరటంఅంట నా పని... యింతేలెండి...నాటకం మొదట్నుంచి చివరదాక ఉంటూ నండోయి.

స : ఎంత అమాయకుడవు గంగులూ...మరి యిప్పుడు దేని కొచ్చి నట్లు?

గం : అమామీకురాలవమ్మా...హిహీహి ... మా అయ్య గోరు ఏదో సీటి యిచ్చి రమన్నారు ... ఏందోంమ యిది. (యిస్తాడు)

స : (తీసికొని)

ప్రియమయిన సరోజకు ...

మీరుమళ్ళీ మరచిపోతారనే ఆవేదనతో నేను మీకు హెచ్చరికగా యీ ఉత్తరం వ్రాస్తున్నాను.

రేపే...మన నవోదయం...మీరు తప్పకుండా వచ్చి మా ప్రదర్శనం చూసి ఆనందిస్తారని ఆశిస్తున్నాను...మరచి పోబోకండి... రేపే మన నవోదయం.

ఇట్లు
చందర్ B. A.

గం : మాసిన్న బాబుగోరు B. A. కాదండో ... యింకా ఎక్కువే ... F. A.

స : (నవ్వుతూ) F. A. కంటే B. A. ఎక్కువరా గంగులూ.

గం : అమామీకుడ్నండి...సదువా...సందా...

స : (తనలో) రేపే మన నవోదయం.

గం : అదుష్టవంతురాలవమ్మా...

స : ఏం ? గంగులూ... ఎందుకని ?

గం : మాసిన్న బాబుగోరు మాలావు శాంతపురుషుండు కదొండ.

స : అయితే !

గం : అయితే ఏమిటో మీకు తెలనదా ? హి హి హి...
అమాయికురాలవమ్మా.

స : చెప్పవా ?

గం : ఆయనే సెపుతాడులే... వెళతాను... శలవండి.

స : (సందేహంగా తల ఊపుతుంది.)

గం : శలవమ్మా ... ఎలతన్నా ... (గంగులు వెళతాడు)

స : (తనలో) ఎంత అమాయకుడు ... చందర్ ... నేటికి
నా మనసు కుదుట బడింది ... అమ్మయ్య.

[ ఇంతలో వైరాగి ప్రవేశం ]

వై : కష్టసుఖములు కావడికుండ లన్నారు. నిన్న ... నేడు...
రేపుల కెంతో మార్పుంటుందమ్మా.

స : ఏఁ! తాతా ? యిప్పటి వరకేం జేశావ్ ?

వై : ఆఁ! అలా అలా తిరిగి వస్తున్నా.

స : సరేగాని తాతా...యివ్వాళ ఎంత మంచి రోజనుకున్నావ్.

వై : ఎందుకనమ్మా ... యివ్వాళ చాల మంచిరోజా ?

స : ఆఁ! యివ్వాళ నా జీవితంలో చాల మంచిరోజు.

వై : పిచ్చితల్లి. కష్టాలొస్తే చింతిస్తావు... సుఖాల్లో ఉంటే
సంతోషిస్తావు... ఇది నీకేగాదు... ప్రకృతికే సహజగుణం.

స: తాతా... వెనుకటిమాటలు త్రవ్వుకున్నా ప్రయోజనం
శూన్యం... ఎందుకా గత జలసేతుబంధనం ?

బై : గతం... నాస్తి... జరిగిపోయిన రోజు లికరావు...
ఎందుకనమ్మా... యివ్వాళ అంత మంచిరోజు...

స : (సిగ్గుపడుతుంది) యివ్వాళ నాజీవితంలో...(ఆపుతుంది)

బై : ఆఁ? నీజీవితంలో...

స : నా జీవితంలో నూతనశకం... ప్రారంభం.

బై : ఎట్లా?

స : ఎట్లాగా... చెప్పనా? సరే చెప్తా విను... అదిగో చూడు చంద్రోదయ మయింది... ఒక శుభసమయంలో... ఆ చంద్రుడు ప్రకాశిస్తూ... ప్రకాశిస్తూ ఒక తారదగ్గరకు వచ్చాడు... ఆ తార ఆ చంద్రుని తేజస్సుకు లొంగిపోయి చంద్రుని చల్లని కిరణాలను స్వీకరించి ఆయనలో లీనమయి పోయింది... అప్పుడా రెంటిప్రకాశం... తేజోమయమై... ఆదర్శంగా... కలకాలం... చల్లగా ఉండాలనుకొని... ఒకే పథంలో...

బై : అర్థమయిందమ్మా... సరోజా... నీవు చాలా అదృష్ట వంతురాలవమ్మా.

స : అదంతా నీవు నేర్పిన ఫలితమే తాతా.

బై : నేను నేర్పిన దేముందమ్మా ... చిట్టితల్లి ... నా కెవరు నేర్పా రట్లయితే ... ఆ భగవంతుని అనుగ్రహం అంతా.

స : సరే ... భోజనానికి వస్తావా?

బై : నీ భోజనానికి వేళయిందా? సరే వస్తున్నాను.

స : నా భోజనానికి కాకపోతే ... నీకు వేళకాలేదా తాతా.

బై : యివ్వాళింకా నాకు ఆకలి అవుతుందా? నేడు నవోదయం కదమ్మా.

స : తాతా ... నీవు ఎంత మంచివాడవు!

బై : చిట్టితల్లి ... ఎంత అమాకపు దానివమ్మా.

స : సరే ... పద భోజనానికి.

బై : (ఆలోచించుకొని) అరె! ఒక ముఖ్యమయిన వస్తువు బజార్లో మరచిపోయాను. యిప్పుడే వస్తా ... ఉండమ్మా సరోజా. (అంటూ వెళతాడు)

స : (అలాగే చూస్తూ నిలబడుతుంది. ఏమీ తోచదు... ఏదో పని కల్పించుకుందా మనుకుంటుంది. కాని ఏమి పనుం టుంది గనుక కల్పించు కోటానికి? అటూ యిటూ తిరుగు తుంది. చందర్ జ్ఞాపకం వస్తాడు.)

స : చందర్ ... మళ్ళీ ఎప్పుడొస్తావో? (అంటూ పాట)

(పాట) రావో రావో ... రావో రావో చిలుకా రావదేల

చిలుకా...పొంగి పొంగే చిలుకా...రంగేలీ

ఓ చిలుకా ||రావోరావో||

[వెనుకనుండి చందర్ ప్రవేశం]

రావేరావే...రావేరావే చిలుకా...రావదేల

చిలుకా...పొంగిపొంగే చిలుకా...రంగేలీ

ఓ చిలుకా ||రావె||

[సరోజ ఆశ్చర్యంతో చూస్తూ]

ఓ...యింతలోన ఎందుకు వచ్చావ్...చెంతకుచేర

రావా? చెంతకు చేరరావా? హృదయము లోన

తీయని వలపులు పొంగిపొర్లసాగే పొంగిపొర్లసాగే ||రావో||

చం : ఓ...పంతాలేలా చెంతకు చేరితే యింతేనా

నీ ప్రేమా...యింతేనా నీ ప్రేమా? మాటలవేవో

మనసులో ఎప్పుడు మసలుతు ఉంటాయే మస
లుతు ఉంటాయే ||రావె||

స : ఓ...అయితే యింకేం...రారావోయీ హాయిగ
ఉందాము...హాయిగ ఉందాము. యీడుజోడు...
యీడుజోడు కలిసినాది...జోడుకలసి ఆడుదాము
జోడుకలసి ఆడుదాము ||రావో||

ఇద్దరు : రావోరావో...రావోరావో చిలుకా రావదేల చిలుకా
పొంగిపొంగే చిలుకా...రంగేలి ఓ చిలుకా ||రావో||

స : ఏం! చందర్...ఎందుకొచ్చావ్...? యిప్పుడేగా గంగులు
వచ్చింది.

చం : సరోజా.

స : చందర్.

చం : మనసులో ఏముంది? మనసు కలవాళ్ళకే తెలుస్తుంది ..
నేను నిన్ను వదలి యిక క్షణంకూడ ఉండలేను...ఏక్షణంలో
నైనా నీవే జ్ఞాపకం వస్తూఉంటావు ... చూడు ... మనది
అనురాగ మయిన ప్రేమ...అందులో అందం ఉంది ... ఆ
అందమయిన ప్రేమలో అనుబంధం వుంది...ఆ అనుబంధాన్ని
త్రెంచుకోవడ మంటే...

స : త్రెంచుకోవడ మెందుకూ...చందర్...నామాట వినవూ...
అసహాయురాలను.

చం : అందుకే యిక్కడుండిపోతాను.

స : లోకం ఏమనుకుంటుంది ... లోకం సంఘం వున్నాయి.
అవి యింకా చావలేదు...నా మాట విను...ఆయనపోయి
ఆరునెల్లన్నా కాలేదు...యింత స్వేచ్ఛగానా ?

చం : లోకం... సంఘం... యిదే... నీకు ఎప్పుడు.

స : నా మాట విను.

చం : సరే... రేపు సాయంకాలం ... నాలుగున్నర గంటలకు తోటలో కలుసుకోనగలవా ?

స : నవోదయం... నాటక మంటివిగా ?

చం : నాటకం... రాత్రికిగా.

స : (సందేహిస్తూ) సరే.

చం : సరోజా... గుడ్ బై ... (అంటూ వెళ్తాడు)

స : ఏమిటో... అర్థంకాని జీవితం... అడుగడుగునా అవరోధాలు ..

(అంటుండగా తెర)

# 8 వ దృశ్యము

[స్థలం జానకిరామయ్య గారిల్లు. గంగులు యింటి ముందర భాగంలో పూలచెట్లకు నీళ్ళుపోస్తూ ఉంటాడు. స్టేజిలో పూలమొక్కలు మాత్రమే ఉండాలి. కూనిరాగాలు తీస్తూ ఉంటాడు గంగులు. స్టేజిని వెనుకటి మాదిరి ముందు వెనుక భాగాలుగా చేయాలి. ముందు భాగంలో కర్టెన్ తొలగి పోతుంది.]

గంగులు : (చెట్లకు నీళ్ళుపోస్తూ)

కొత్త కొత్త కోడెలగట్టి, కొమరభూము లమరదున్ని
ఏసినావ సెరుకుతోట ఏటివారాన...
హెయ్...నక్కలున్నయిరా నరసన్నా...
గుంటనక్కలున్నయి రోయ్ నరసన్నా...
సుట్టుపట్ల తోటలన్ని సుట్టుకోని పోయినాయి
నరసన్న తోటలోనా నక్కతినని చెరుకులేదు ||కొ||
బాయిలోనా బండబడె...బక్కెద్దు నేలబడె...సాలించరా
సెరుకుతోట . ఎందుకేస్తివిరా సెరుకుతోట ||కొ||

(జానపద గేయం ననుసరించి)

(యింతలో ప్రవేశం జానకిరామయ్య)

జా : (ధుమధుమలాడుతూ చేతిలో కర్ర విసిరిపారేస్తూ) వెధవాయి ... వాడింత వరకూ వచ్చాడూ? చూడు వాణ్ణి యింటికిరానీయి ... ఏంచేస్తానో.

గం : (నీళ్ళుపోయడం ఆపి) ఎవరండి దొరా ... ఏందో మాలావు కొంపరులో ఉండారే.

జా : ఎవరా...వాడే...మన చందర్.

గం : ఏంటి జానయ్య దొరో ... మనబ్బాయి కేమండి... నిచ్చేపం లాంటోడు...మా అయ్య బంగారం కదూ.

జా : ఆఁ! బంగారమే...వాడా? యికవాడికి నాకు యివ్వాళ్తో సరి ... యింకవాడు నాకు కొడుకుగాడు ... వాడెవడో...నేనెవడ్నో.

గం : సాల్లేండి...జానయ్య దొరో...ఏంటా మాటలు...ఎవ్వరన్నా యింటే నవ్వి పోతారు.

జా : ఎందుకు నవ్వుతారు...వాడుచేసే పనికా? నేను చేసే పనికా?

గం : ఏంచేశాడో సెప్పరాదూ? నే సెప్తాగా ఆడునకు.

జా : ఎం చేశాడా?...యీ వెధవెంత, వీడివయస్సెంత?. .ఎక్కడ చూచినా వీడేనట...ఆ నాట్యమండలిలో చేరి నాటకాలు వేస్తున్నాడట. అందుకని ఊళ్ళోముష్టి ఎత్తి తిరుగుతూ ఉన్నాడట. ఇదీ చాలక ఆ బాలవితంతు వొకటి చచ్చిందిగా? దానితో వీడికి సంబంధం ఉన్నదని ఊళ్ళో ప్రతిచోట పుకారు. యీ అపవాదంతా ఎవరు పడతారు...? కన్న తండ్రి కయినా సిగ్గుండాలి...యికవాడితో తెగతెంపులు చేసుకోనందే లాభంలేదు.

గం : ఓదొరో? ఆమె నా మాటంటే పురుగులు పడిపోతారు. వట్టి అమాయికురాలండి ... ఆమె సీతామాలక్ష్మితో సమానం.

జా : ఆఁ! సీతామహాలక్ష్మ్మే... అదీ . ఆడజన్మే ఎత్తిందిరా?

గం : అయితే ఏం...చాల మంచోరు లెండి.

జా : ఛీ! వెదవా? ఆ దగుల్బాజీదాన్ని పెళ్ళిచేసుకుంటాడట. దాని సంగతి నాకు మొన్ననే రాజా చెప్పాడు.

గం : అసాగదుగో...ఆ మాటంటేనే పుసుగులు పడతయి... మీాకు కోరు ఎట్లా వచ్చిందండి?

జా : నాకు వచ్చేదేమిటి? నా నోరు మూాస్తే లోకం నోరు మూాస్తుందా...లోకం ఒక్కొక్కడిగా కోడై కూాస్తుంటే.

గం : లోకానికేం తెలుసు...లోకులు కాకు లన్నారు.

జా : అసలు కారణం లేందే రాదనుకో... అగ్గిలేందే...పొగ వస్తుందా? నీవుకూడ దాస్తున్నావు ... నీకు తెలియదా? నిజం చెప్పు.

గం : (దాస్తూ) హిహిహి...భలేవారండో...జానయ్యదొరా! నాకేం తెలుసండి?

జా : సరే...పోయి యింటో పనిసూాడు...మాటలు తర్వాత చెబుదువుగాని.

గం : మాటలు మీారు సెప్తుంటే నేనింటన్నాగాని నాకు మాటలు సెప్పటం శాతవునండో.

జా : ఏడిశావ్ గాని వాడొస్తున్నాడు నీవు వెళ్ళు.

గం : సిన్నబాబయిగోరు...బంగారం...(వెళతాడు)

జా : (చందర్‌ను కోపంగాచూస్తూ) ఏరా...? నీవు చేసిన మాట నిజమేనా?

చం : (దగ్గరకు ప్రవేశించి) ఏమిటి చేయడం ... అర్థం పర్థం లేకుండ.

జా : అవు నర్థం ఉండదు. ఎందుకంటుంది? నా వొక్కనోరే గాదు. లోకం నోరు మూాయాలి మరి ... అది నీ సాధ్యం అవుతుందా?

చం : మీా రనేది నాకర్థం కావడం లేదు.

జా : అర్థంకావడం లేదా ?

చం : ఉహూం !

జా : నీవు నాటకాల్లో వేషాలువేసి ఊళ్ళో ముష్టి ఎత్తుకు తిరిగే మాట.

చం : ఓ యిదా ? అవును ... అది ముష్టి ఎత్తుకు తిరగడమే నని మీరూహించితే, మీ ఊహ నిజమే ... అయినా అందులో కూడ మీ జోక్యం ఉండాలా ?

జా : సరే...నీకు దాంతో సంబంధం ఉన్నమాట ?

చం : దేనితో ?

జా : (ద్వేషంగా) ఆ వెధవనుండతో !

చం : (నవ్వి) ఏ వెధవనుండ ?

జా : అదే ... ఆ పిల్లజామీందారు మూడో పెళ్ళాం.

చం : నాన్నా ... (రెండు కళ్ళు చేతుల్తో మూసుకుంటాడు) యిప్పు డర్థమయింది ... నా మనస్సును యిక అట్టే బాధ పెట్టకండి.

జా : బాధ...ఎందుకుండదు బాధ ... పిల్లి పాలుత్రాగుతూ... తన నెవరూ చూడ లేదను కుంటుంది ?

చం : నాన్నా ... ఆమె వెధవ ఎలా అవుతుంది ... ఆమె అమాయకపుబాల.

జా : ఆహాఁ ! ఆమె బాల...నీవు బాలుడవు...ఆమె వెధవ కాదు ... విధవ అంతేనా ? యిక చాలుగాని నోరు మూయి... నా కడుపును చెడబుట్టావ్ ... ముప్పయి వేలు కట్నం యిచ్చే మనువును కాదని కాలదన్నావు ... అనేక మనువులువస్తే ఎదురు తిరిగావ్.

చం : నాన్నా ... నా మాట నంగీకరించవా? నే నామెను ప్రేమిస్తున్నాను.

జా : ఛీ! ఛీ! ఆమెను ప్రేమించడ మేమిటి... పెళ్ళి చేసుకొని ప్రేమించు. ప్రేమించి పెళ్ళిచేసుకోవడం ... మన సంప్రదాయానికే విరుద్ధం.

చం : నాన్నా ...సిద్ధాంతాలు వేరయినవి. యీ సిద్ధాంతాల మధ్య నిరంతరం పోరాటం లేకుండా ఉండాలంటే నిరంకుశ శక్తి ఓడిపోవాలి. నాన్నా ... ప్రేమ...అమరత్వపు అందె చిందులలో వెలిగే అందరాని ఆరని అమరజ్యోతి... ఆమె జీవితధ్రువతార. ఆ తార నా హృదయంలో జ్యోతిలా ప్రకాశిస్తుంది.

జా : అయితే లోకం అనేమాట నిజమే నంటావ్ ... చందర్ ... నామాట విను. సంప్రదాయాలు ... గౌరవం గలిగిన కుటుంబమోయ్ ... చందర్ ... నీకు నేను ఎందుకు చెప్తున్నానో గ్రహించుకో.

చం : ఏమయినా ... నే నామెను తప్ప యింకెవరినీ వివాహ మాడను. యిదే నా దృఢనిశ్చయం.

జా : ఎదురు తిరిగావ్ ... ముదిరి పోయావు ... చందర్... మీ నాన్న యీ వివాహానికి ఒప్పుకోడు ... ముమ్మాటికి ఒప్పుకోడు ... నీ కిప్పుడే వివాహం చేస్తాను.

చం : (నవ్వి) నా వివాహం నా కిప్పుడే చేస్తావా? నాన్నా నా వివాహసమస్య...నా జీవితసమస్య...నా జీవితసమస్యను పరిష్కరించుకొనేది నేనే ... మీ బాధ్యత తీరిపోయింది.

జా : అవును... పెంచాం...పెద్దవాళ్ళను చేశాం...వివాహం చేయాలని అనుకున్నాం... నీయిష్టంలేదు అని అనిపించు కున్నాం. చందర్... వెదురుబొంగు... ముదిరిన తరువాత పల్లకీ బొంగుగా తయారవ్వుతుందా ? కాలం మారిపోయింది.

చం : కాలం మారిపోలేదు నాన్నా... మనుష్యులు మారి పోయారు. ఆశయాలు మారిపోయినయి. సిద్ధాంతాలు చచ్చిపోయినయి... నాన్నా... యిరవైరెండు సంవత్స రాల కొడుకును... యింకా ఎన్నాళ్ళు బానిసత్వం... ?

జా : సరే... నేను పనికిరాను... నా సిద్ధాంతం పనికిరాదు. నా మాటలు పనికిరావు... యింకేం... నా యిల్లుకూడా పనికిరాదు... నా యింట్లో నా మాటలు వినేటట్లయితేనే ఉండు.

చం : నాన్నా...? నీ యిల్లు... అవును... నీయిల్లే. నాన్నా... ఒక్కగాను ఒక్కకొడుకును... వెళ్ళిన తరు వాత చాల బాధపడతావు... పుత్రశోకంలో క్రుంగి, కృశించి, నశించి పోతావు.

జా : నాకా... నీవు బ్రతికున్నా ఒకటే...(మాట ఆపుతాడు) నాకడుపు చెడబుట్టావు. జీవన్మృతుడా ?

చం : జీవన్మృతుణ్ణి కాదు. మృతజీవుణ్ణవుతా ?

జా : ఆఁ ! నీబోటివాళ్ళే... !

చం : అయితే వెళ్ళమంటావా ? ఋణానుబంధం నేటితో తీరి పోయిం దనుకుంటా ? (వెళ్ళబోతాడు)

జా : (జాలిగా) చందర్... నన్ను పరీక్షచేస్తున్నావా ?

చం : నాన్నా? నాకు తెలుసు. నీవు మొదట కోప్పడతావని. నాన్నా... యీ వివాహానికి ఒప్పుకో... నాన్నా...

జా : ఒక్కగాను ఒక్కకొడుకువి... (హృదయంలో హత్తుకుంటాడు.)

చం : నాన్నా... (శూన్యంగా చూస్తాడు. యిద్దరు వెళతారు)

(రెండో కర్టెన్ తొలగిపోతుంది.)

[స్థలం. ఒక చిన్నతోట ప్రకృతి రమణీయమయిన దృశ్యం. సమయం సాయంకాలం 4½ గం. సరోజ ఒంటరిగా ప్రవేశం.]

స : (పిలుపు) ఓ... ఓ హొ... ఓ హొ హొ...

ఓ... చందా... రావే చందా...

సమయమాయె .. రావో... చందా...

(అటు యిటు తిరిగి చూస్తుంది. నిరీక్షిస్తూ కూర్చుంటుంది.)

చందర్...చందర్ ... (ప్రకృతి అంతా మబ్బులమయం. మెరుపు ధ్వనులు వినబడుతాయి. గాలి హోరున వీస్తుంది) చందర్...అబ్బ ... ప్రకృతిలో ఎంతమార్పు ... అవిగో నల్లని మబ్బులు...ప్రకృతంతా గాఢాంధకారం...తాతా ...నాకు భయం వేస్తుంది ... అబ్బ... జీవితంలో నిజంగా ఏ క్షణంకూడ అపాయమే. ప్రతిక్షణం పరీక్ష...అబ్బ.

(ప్రకృతి మెరుపులు...ధ్వనులు)

స : చందర్...సరిగా 4½ గంటల కంటివే...యింకా రాలేదేం?

(యింతలో రాజా ప్రవేశం)

రా : అహ్హాహ్హా... అందాలబాల ... వలపులరాణి ... ప్రేమ వాసంతి...అహ్హాహ్హా.

స : (కెవ్వున కేక వేస్తుంది)

రా : అహ్హాహ్హా భయ మెందుకే...సరోజా.

స : (భయపడుతూ) రాజ్ ... నన్నింకా బాధించ దలచు కున్నావా?

రా : అహ్హాహ్హా...నిన్నెందుకు బాధించుతానే.

స : రాజ్...నన్నీ ఒక్కసారి వదలిపెట్టు.

రా : అహ్హాహ్హా...ఒక్కసారి వదలిపెట్టాలా? హుం! ఎన్ని సార్లు వదలిపెట్టలేదు. కృతఘ్నురాలా!

స : (బ్రతిమాలుతూ) నీకు పుణ్యముంటుంది.

రా : పిచ్చిదానా! కలసివచ్చిన ప్రేమను కాలదన్నుకుంటానా? జీవితంలో అవకాశం కలగడమే అరుదు. ఆ అవకాశాన్ని అదనులో ఉపయోగించుకోవాలి. సరోజా! ఒక ఆడదాన్ని ప్రేమించడమే అన్యాయమయితే...మగవారిని ఏడ్పించడం అన్యాయం కాదా?

స : రాజ్ ... ఒక అబల నిలా బాధించడం నిజాయితీగల యువకుని ధర్మంకాదు. ఆడది అంటే కేవలం పురుషకారా నికి లొంగే మట్టిబొమ్మగాదు.

రా : (వికటంగా నవ్వుతూ) ఆడది అంటే పురుషకారానికి లొంగే మట్టిబొమ్మగాదు...ఆడదిఅంటే మాయ అని నాకు తెలుసు. ఆడది అంటే మిథ్య అని నాకు తెలుసు.

స : రాజ్...నీ బ్రతుకుకోరి బ్రతిమాలుకుంటున్నాను. నా జీవి తాన్ని నాశనం చేయవద్దని కోరుకుంటున్నాను. అసహాయు రాలైన ఆడదాన్ని అన్నివిధాలా కష్టపెట్టి ... నష్టాలకు గురిచేయబోకని ప్రార్థిస్తున్నాను నా ప్రార్థన వినవా?

రా : సరోజా...నన్ను ప్రేమించి పెళ్ళిచేసుకోమని అర్థిస్తున్నాను. అచంచలమయిన నా ప్రేమను అంగీకరించమని ఆరాధిస్తున్నాను. సరోజా ... నీ శిరోజములను కూడుకొని ఉండే పువ్వులనుగూడ వాడనీయను ... నిన్ను ... నా అందాలరాణిని చేసి ... అందెల్లో పూజిస్తా ... (సమీపిస్తాడు)

స : రాజ్...ఆగు...అడుగు ముందుకువేస్తే అపజయంతప్పదు.

రా : (సమీపించి) తప్పదూ? అపజయం తప్పదూ? యిదే... ఆఖరుసారి...చావో బ్రతుకో ... ఆలోచించుకో...ఆలోచించి సరైనమార్గంలోకి రాకపోతే...నిన్ను నిలువునా ఖూనీ చేస్తాను. (అని జేబులో చాకు తీస్తాడు)

స : (భయపడుతూ) ఖూనీ ! (అని కెవ్వున కేకవేస్తుంది)

రా : అహ్హాహ్హా ... ఏమంటావ్ ... కంగారులేదు ... నేనూ మెదడున్న మానవుణ్ణే... నాలోకూడ యవ్వనం ఉంది ... అహ్హాహ్హా.

స : (దగ్గరకు వెళ్ళి) సరే ... చంపు.

రా : అలా దారికిరా... (చాకు జేబులో పెడతాడు) యీబుద్ధి నీకు మొదటే ఉండగూడదూ ... (పట్టుకోబోతాడు... సరోజ వెనుకకు జరిగిపోతూ ఉంటుంది. యింతలో చందర్ పిలుపు)

చం : ఓ ... ఓహో ... ఓహోహో.

స : చందర్... చందర్... యిక్కడే... యిక్కడే... (పరుగెడుతుంది.)

[రాజ్ అనుసరిస్తాడు. చందర్ సరోజను కలుసుకుంటాడు. సరోజ చందర్‌ను గట్టిగా కౌగలించుకుంటుంది భయపడుతూ]

రా : (చందర్‌నిచూచి వికటాట్టహాసంచేస్తూ) చందర్... అహ్హాహ్హా... చూసుకో... (అని మీదికి వస్తుంటాడు.)

చం : (బతిమాలుతూ) రాజ్... నీమేలుకోరి... నిన్నెన్నో సార్లు బతిమాలాను... నీసిద్ధాంతాలు మార్చుకోనమని... నీ జీవితాన్ని బాగుచేసుకోనమని... నీ కనేక సార్లు చెప్పాను... దాన్ని నీవు వ్యతిరేకిస్తున్నావు... రాజా... నీలాటి యువకునకు యీ వయసులో ఎన్ని అభ్యుదయ భావా లుండవలసినది? అవన్నీ మంటగలిపి నిరంకుశత్వాన్ని ప్రయోగిస్తున్నావా? నిరంకుశ శక్తి... అభ్యుదయశక్తుల మధ్య పరస్పర పోరాటం యింకా ఎన్నాళ్ళు సాగిస్తావు... రాజ్... అభ్యుదయశక్తి ప్రజాశక్తి .. నిరంకుశ శక్తి ఏక శక్తి... ప్రజాశక్తి ఏకమయినప్పుడు, నిరంకుశశక్తికి పతనం తప్పదు.

రా : అహ్హాహ్హా... పతనం... చేతనం లేని వాడికి పతనం... అంతేగాని చావదెబ్బతిన వాడికి పతనం... (చాకుతీసి మీదికి దుముకుతాడు. చందర్ చాకును చేత్తో ఎగరగొట్టి చాకు మీద కాలు వేస్తాడు. సరోజ కెవ్వున కేక వేస్తుంది. రాజ్ దూరంగా పోతాడు. చందర్, చాకును చేత్తో తీసు కొంటాడు. రాజ్‌ని సమీపిస్తూ)

చం : రాజ్... అపజయం తప్పదు... ఏం! ఒప్పుకున్నావా?

రా : చందర్... ఓడిపోయాను... చందర్... ఒప్పుకున్నాను.

[దగ్గరకొస్తాడు. చందర్ చేతిలో చాకు క్రిందకు కొడతాడు. చందర్ దాన్నందుకోబోతూ ఉండగా రాజ్ చందర్ను క్రింద పడవేస్తాడు. యీ లోపుగా సరోజ భయపడి పరుగెత్తుతుంది. చందర్... రాజ్... పరస్పరం పోట్లాడుకుంటూ ఉంటారు. చందర్ రాజ్ని క్రిందకు తిప్పికొట్టి... చాకును మడచి జేబులో పెట్టుకొంటాడు. రాజ్ క్రిందనుంచి లేవడానికి ప్రయత్నిస్తాడు. లేచేలేచేవాణ్ణి అణచిపట్టి... రెండు మూడు పోట్లు పొడుస్తాడు. రాజ్ అట్టహాసంచేస్తూ... పెద్దగా... అరచి క్రిందకు తలవంచుతాడు. చందర్... రాజ్ చిత్తయినాడని లేచి..."సరోజా సరోజా" అంటూ లేస్తాడు. యీసమయంలో రాజ్, చందర్ను దొంగచాటుగా పైకెత్తి క్రిందకు గొడతాడు. చందర్ క్రింద పడిపోతాడు. చందర్ని రాజ్ తల నేలకేసిపొడిచి ... తప్పించుకు పారిపోదామని లేవబోయేసరికి ... చందర్ మెల్లగా తప్పుకొని...రాజ్ చెయ్యిపట్టుకొని...గట్టిగా విరగదీస్తాడు... అమ్మా అంటూ రాజ్ నేలకూలుతాడు. సరోజ తిరిగివస్తుంది.]

రా : (బాధపడుతూ) అబ్బ... బాధ ... చందర్ ... జయించావు... అబ్బ... సరోజా... బాధ... నేను చచ్చిపోతున్నాను. నన్ను రక్షించవూ... నాబాధ నాలకించవూ... చందర్ ...నన్ను లేవదీసి రక్షించవూ...అ బ్బ...బాధ... నా కాలూ చేయి విరిగి పోయినయి... అబ్బ... చందర్.

చం : (లేవదీయ బోతాడు. ఇంతలో తెరలో మాటలు)
నాన్నా...పాముకు పాలుబోసి పెంచితే ఏమవుతుందో ఆలోచించుకో.

స : ఛీ! నీచుడా. ని న్నే మోహం పెట్టుకొని రక్షించాలి? పాపీ... నా జీవితాన్ని నాశనం చేశావు.

రా : అబ్బ... బాధ... నేను నీచుణ్ణే... నేను పాపినే... నేను నీ జీవితాన్నే గాదు ... చాలమంది జీవితాలను నాశనం చేశాను...యీ ప్రపంచంలో నాకు "నా" అనేవారు లేరు. ఎందుకు లేరు? బుద్ధిః కర్మానుసారిణి... సరోజా... నేను పాపినే...నేను ద్రోహినే... ఒప్పుకున్నాను అబ్బ... బాధ.

[ ఇంతలో బైరాగి తంబుర వాయిస్తూ ప్రవేశం ]

బై : ఒడలు పచ్చగని ఆసూపపడితే...
మొదటికి మోసం వచ్చెనురా...
తెలాగ తలకాలం బ్రతకక
హంసవై క్షణమే ఆడుమురా
ఇది నిత్యంరా ... నిత్యం సత్యం
తెలుసుకోరా ... జై సద్గురువా...

ఆనందం ... పరమానందం ... బ్రహ్మానందం... జీవికి ... జీవించాలని ఆశఉంది. అంతే జీవించు.

రా : (పిచ్చివాడిలా) ఎవరు? నే నెరిగున్నా...నిన్ను...ఎవరు? బ్రహ్మానందం ఎవరు? బ్రహ్మానందం మా అన్నయ్య కదూ ... వాణ్ణి నేనే యింట్లోనుండి వెళ్ళగొట్టాను... అడుగో ... మా అన్నయ్య మాటలు ... నాచెవుల్లో విన బడుతున్నయి. అన్నయ్యా... బ్రహ్మానందం .. యీప్రపంచంలో యిక నాకు లేరు. ఎవరూ లేరు ... నేనుకూడా లేను... ఆఖరుకు ... నీ వేదాంతమే నిజమయింది...

సరోజా...నీ జీవితాన్ని నాశనం చేశాను...మా అన్నను, అడవులపాలు జేశాను. మా అన్నయ్య గొప్ప వేదాంతి ... మా అన్నయ్య బాగా చదువుకున్నాడు. అమ్మ...బాధ... అన్నయ్యా...బ్రహ్మానందం...నీవుకూడా లేవా?

బై : (మాట నందుకొని) ఉన్నాడు... మీ అన్నయ్య యింకా బతికున్నాడు. (చందర్ సరోజ ఆశ్చర్యంతో చూస్తూఉంటారు)

రా : ఉన్నాడా? నీ జ్యోతిష్యం ... నిజమే అయితే ఎక్కడున్నాడు చెప్పు ... సరోజా ... మా అన్నయ్య యింకా బ్రతికే ఉన్నాడు. నన్ను వెదుక్కుంటూ వస్తాడు...అడుగో ...ఆ మాటలు నా చెవుల్లో వినబడుతున్నయి.

బై : నాయనా ... మీ అన్నయ్య యిట్లాగే ఉంటాడుగదూ (అనిగడ్డం మీసం అన్నీ తీసివేసి మామూలు మనిషిలా నిలబడతాడు. సరోజా...చందర్...నిశ్చేష్టులయి పోతారు)

స : తాతా.

రా : అన్నయ్యా (అంటూ మెల్లగా లేవబోతాడు)

బై : (నవ్వుతూ) సరోజా...నేనింకా తాతనేనా...? (రాజ్ వంక చూస్తూ) రా ... తమ్ముడూ? పశ్చాత్తాపమే పాప విమోచనం... (రాజ్‌ను మెల్లగా లేవదీస్తూ) తమ్ముడూ... నీ జీవితంలో వెలుగు యీనాటినుండే ప్రారంభం.

రా : (నవ్వుతూ) అన్నయ్యా! ఎంత నాటకమాడావు... నేను చేసిన పాపాలకు నన్ను జైలుకు పంపించు.

బ్ర : తమ్ముడూ... పశ్చాత్తాపమే పాపవిమోచనం... అదే నీకు శిక్ష... (సరోజవంక చూస్తూ) సరోజా...బాగుందా మన నాటకం!

స : ఓ... చాలబాగుంది... మననాటకం... అందులో మరీ నీ పాత్ర చాలబాగుంది... బ్రహ్మానందం అన్నయ్యా... నీవు నిజంగా ఎంత మంచివాడవు?

బ్ర : (ఎంతో ముచ్చట పడుతూ) అబ్బ...ఎన్ని సంవత్సరాలకు నాపేరుతో పిలువబడ్డాను. సరే... చందర్... మీా నాన్నను తీసుకురా... నాయనా... (అంటూండగానే జానకిరామయ్య, గంగులు ప్రవేశం.)

చం : నాన్నా... నేడే మనందరికి నవోదయం...

జా : ఏమిటీ రాద్ధాంతం? (బ్రహ్మానందాన్ని చూపిస్తూ) ఇత నెవరూ . యీరాజా ఎందుకొచ్చాడు... ఏరా గంగులూ! నన్నెందుకు తీసుకొచ్చినట్లు? ఆఁ! రాజా చెయ్యేమిటి... పైకెత్తుకొని ఉన్నావు.

చం : నాన్నా... అభ్యుదయ శక్తుల కపజయం లేదు.

రా : (తడబడుతూ) అదేనండీ... ఆవేళ మీా చందర్‌ను కొట్టిన చేతికిది శిక్ష.

బ్ర : (చేతిలోని కాగితాన్ని యిస్తూ) గంగులూ... యీా కాగితాన్ని చదివి వినిపించు...

గం : ఏందొండ...నాకు సదువేమొచ్చునండ...నాకిత్తారు... మా దొరగారు సదువుకున్నారు లేండి... (జానకి రామయ్య కిస్తూ) సూడు జానయ్య దొరా...యీా తెల్లకాగితం మీాద నల్లచ్చరాలు ఏమిటో?

జా : [illegible] ...హా) వరుడు [illegible] ... నవ్వు సరోజ ... [illegible] ? అమ్మాయికి తల్లిదండ్రి లేకపోయినా అబ్బాయికి తండ్రి లేడూ ?

బ్ర : పొరబాటే ... (సరిచేసి యిస్తాడు)

జా : అవును. శుభలేఖ యిట్లాఉండాలి...ఆఁ! కానివ్వండి ... యిదా ...సంగతి ...బాగానేవుంది.

బ్ర : (యిద్దరి చేతులుకలిపి) ఆయురారోగఐశ్వర్య సిద్ధిరస్తు. (రాజావంక చూస్తూ) తమ్ముడూ! జీవితం అంటే కష్టసుఖముల కలయికరా ... జీవిత మాధుర్యం జీవిత సమస్యల నెదుర్కొనడంలోనే వుంది. చింతలకు కష్టాలకు వెరచి పిరికి పందవలె పారిపోవడంలో లేదు. ఇదే మానవుని జీవితం.

గం : (నవ్వుతూ) జానయ్య దొరోవ్ ... సిన్నబ్బాయి గారిది రాజయోగం బాబు. దొరా ... ముప్పయియేల కెక్కువే కొట్టేశావ్ ...పో.

జా : ఆగవోయ్ ... గడ్డాలు మీసాలు నెరిసినా ఎగతాళి పోనిచ్చావు గాదు.

బ్ర : రాజా యిటురా... ఎక్కడో పుట్టి ఎక్కడో పెరిగిన వాళ్ళం మనం... ఏంతయినా తనవారు తనవారే... సరే... భగవంతుడు... మనకు కాళ్ళు చేతు లిచ్చాడు. యీ విశాల-ప్రపంచంలో కష్టించి పనిచేసి బ్రతుకుదాం పద. సరోజా... శలవ్... చందర్ వస్తాం.

స : ఆఁ ఆఁ... ఏమిలేదు ... పోనీలెండి... ప్రశాన్తమైన అన్నయ్యా! మీరిద్దరూ యిక్కడే ఉండాలి... చంద్రా అదుగోచూడు చంద్రోదయ మయింది.

చం : అదే నవోదయం.

(యిద్దరూ కలిసి పాట)

చం : ఇదేయిదే... ఇదేయిదే జీవితం...
ఇదేకదా జీవితం... ఓ... మధుర
మయిన జీవితం... ఇదేయిదే...

స : జీవితానంద మయిన జీవితం...
హాయి హాయిగదా మన జీవితం
యీ ప్రేమ జీవితం... ఇదేయిదే...

ఇద్దరు : ఇదేయిదే...

(తెర)

సంపూర్ణము

నలందా ప్రెస్, మారీసుపేట - తెనాలి

త్వరలో ముద్రితము

శ్రీ మాదినేని సీతారామయ్యగారిచే రచింపబడిన

## "ప్రపంచం" అను నాటకం

జియాసర్వాది రచించిన "హామ్‌లోగ్" నాటకమున కనుకరణ.

## తప్పొప్పుల పట్టిక.

| పేజి. | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 18 | 12 | లాడిందే | లాడందే |
| 40 | 16 | ఉదయం | రాత్రి |
| 87 | 5 | తిరిగడమే | తిరగడమే |